21.6.1996 శుక్రవారం 12 పేజీలు సంపుటి:68 సంచిక:25 విడిప్రతి రూ.2.00లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



# చంద్రతంత్రం ఫలించేనా?

ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు ప్రభుత్వాన్ని ఆర్థిక సంక్షోభం నుంచి గట్టెక్కించ డానికి మద్యపాన నిషేధం సడలింపునే ప్రధాన మార్గంగా భావిస్తున్నారు. తక్షణ ఫలితాలు రావాలంటే అదొక్కటే అవకాశమన్నది ఆయన భావన. అందువల్లే ఆయన దీనిపై అంత విస్తృత చర్చకు నాంది పలికారు. రెఫరెండం ఆలోచన చేస్తున్నారు.

రెఫరెండం అనేది పెద్ద రాజకీయ తంత్రం. తన ప్రభుత్వాన్ని అప్పుల వూబి నుంచి గట్టుకు లాగ గల్గిన చేవ ఒక వైపు; తనను రాజకీయంగా భూస్థాపితం చేయగల్గిన శక్తి మరొక వైపు కల్గిన మద్య నిషేధ ఔత్రర్యును అత్యంత మెళుకువతో పరామర్శించాలి. రెఫరెండంలో మద్య నిషేధం రద్దు పట్ల వ్యతిరేకత వెల్లువైతే - అది తన ప్రభుత్వానికే ముప్పుగా పరిణమించే అవకాశం వుంది. అందువల్ల అటువంటి సాహసం చేయవద్దని హితైషులు బాబుకు సలహా చెప్తున్నారు. రెఫరెండం లేకుండా నిషేధం సడలిస్తే విమర్శకుల నోళ్ళు అదుపు చేయడం అసాధ్యం. ఇప్పుడే ఉద్యమం పునః ప్రారంభిస్తున్న ప్రకటనలు కూడా వస్తున్నాయి. సాహసించి మద్యం అనుమతించినా - అంగళ్ల ఎదుట అల్లర్లు జరిగితే సంకట పరిస్థితి ఎదురౌతుంది. పాపం చంద్రబాబు పరిస్థితి కరవ మంటే కప్పకు కోపం; విడవ మంటే పాముకు కోపం అన్నట్లుందిప్పుడు.

* * *

ఈ గొడవలో మంత్రి వర్గ విస్తరణ వెనక్కు పోయింది. ముఖ్య మంత్రి ఆ మాటే ఎత్తడం లేదు. అసలే చిక్కుముడులుగా వున్న రాజకీయ సమస్యలకు మంత్రి వర్గ విస్తరణ జరిపితే పీటముడులు పడిపోతాయని భయపడుతున్నా రాయన. అయితే హరికృష్ణనూ దూరంగా పెట్టడం చంద్ర బాబు సాహసమే నవాలి. లెక్క ప్రకారం పార్లమెంట్ ఎన్నికలు ముగియగానే హరికృష్ణను మంత్రి వర్గంలోకి తీసుకొని వుండాలి. కాని ఆయన కంత విలువ ఇవ్వలేదు ముఖ్య మంత్రి. ఎమ్మెల్యేలకు లేఖాస్త్రాలు సంధించి; పత్రికల వారి దగ్గర నోరు జారి హరికృష్ణ కూడా వ్యవహారం చెడగొట్టుకున్నాడు. బెదరిస్తే భయపడి తనకు లొంగి వస్తాడను కున్నాడు; కాని ఆ బెదిరింపులు వికటించి తనను ఆహ్వానం హోటల్ రెస్ట్‌లో పండ బెట్టాయి.

హరికృష్ణ ఇప్పుడు పూర్తిగా ఈనాడు రామోజీ రావు ఆశ్రయంలో, మార్గదర్శ కత్వంలో చేరి పోయాడని వినికిడి. పూరకే నత్తు మాటలు మాట్లాడకుండా అదను కోసం ఎదురు చూస్తే - సందు దొరికినప్పుడు చావుదెబ్బ కొట్టవచ్చునని రామోజీ రావు సూచించి నందువల్లే హరికృష్ణ మౌనవ్రతం పూని, పాత్రికేయులకు అడ్రస్సు దొరక కుండా వుంటున్నారని వినికిడి.

* * *

రాష్ట్ర మంత్రి వర్గంలో మార్పుల కంటే కేంద్ర క్యాబినెట్‌లో కొత్త వారికి అవకాశం కల్పించే విషయమై చంద్ర బాబుపై వత్తిడి అధికంగా వుంది. మొదటి విడతలో ఛాన్సు దొరకని బుల్లి రామయ్య వంటి వారు ముఖ్య మంత్రిని ఒత్తిడి చేస్తున్నారు. కాని బలవంతులకు పదవు లివ్వడం తనకు తాను ఎసరు పెట్టుకోవడమేనని చంద్ర బాబు భయం. అందువల్లే ఆయన ఎర్రం నాయుడు వంటి వారికి ఢిల్లీలో పెద్ద పీటలు వేయించారు. ఎంత పెద్ద పదవిలో వున్నా తనకు అణిగి మణిగి వుండేవారే తనకు కావాలని; తాను గౌరవించ వలసిన పెద్దలను పదవులకు పంపితే తన అస్తిత్వానికే ముప్పు వస్తుందని ఆయన భయం. అందువల్లే ఆయనిప్పుడు కేంద్రంలో కొత్త మంత్రిత్వాలడిగే కంటే, ప్రాజెక్టులు అడగడం రాష్ట్రానికి మేలనే వితండ వాదం మొదలు పెట్టారు. రాజకీయానికి, పరిపాలనా పరమైన నిర్ణయాలకు లంకె పెట్టడం బుల్లి రామయ్య వంటి వారిని నలతకు గురి చేస్తున్నది.

గవర్నర్లు, విదేశాలలో రాయబారులు, వివిధ కార్పొరేషన్ ఛైర్మన్ల పదవులకు అవకాశాలుండడంతో తెలుగు నాయకు లందరూ చంద్రబాబు చుట్టూ గిరికీలు కొడ్తున్నారు. ముఖ్యమంత్రి మహర్దాతకం అంత జబర్దస్తీగా వుంది.

కేంద్రంలో కార్పొరేషన్ల పదవులు తమకు ఇవ్వాలని ఎమ్మెల్యేలు కోరుతున్నారు. మొన్నటి పార్లమెంటు ఎన్నికలలో తమ తమ నియోజక వర్గాలలో తెలుగు దేశానికి మెజారిటీ తెచ్చిన ఎమ్మెల్యేలకు పదవులిస్తానని చంద్ర బాబు చెప్పిన మాట నిలబెట్టుకోక పోవడంతో వారిలో చాలా అసంతృప్తి ప్రజ్వరిల్లు తున్నది. కనీసం కేంద్రంలో కార్పొరేషన్ ఛైర్మన్ పదవు లిచ్చినా బాగు పడతాము కదా అన్నది వారి ఆలోచన. కేంద్ర సంస్థలలో అధికారులు ఎట్లున్నా

కొరవ 8 పేజీలో

## కోట్లవారికెంత దురాశ?

ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికి నిచ్చెనలు వేయాలని ఉబలాట పడడమనే సామెత వూరికే రాలేదు; కోట్ల విజయ భాస్కర రెడ్డి వంటి వారు వుంటారనే వూహతోనే పెద్దలా లోకోక్తి సృష్టించి నట్లున్నారు. పివి పోతే ఎఐసిసి బొంత నాది అని ఆయన వురవుర లాడడం చూసిన వారి కంతా ఈ సామెతే గుర్తుకు వచ్చింది. దేవగౌడ ప్రధాన మంత్రి కాగా లేనిది విజయ భాస్కర రెడ్డికి ఎఐసిసి అధ్యక్ష పదవికి స్థాయి లేకపోతుందని చెప్పలేము; కాని తనకా అర్హత వున్నదీ లేనిదీ ఆయన ఆలోచించినట్లు లేదు.

విజయ భాస్కర రెడ్డి గారు ఇంచు మించు ఏడదుగుల పొడగరి; డెబ్భై దాటిన వయస్కుడు. అందువల్ల పెద్ద మనిషి క్రిందే లెక్క. కాని రాష్ట్రంలో కాంగ్రెస్ తుడిచి పెట్టుక పోయిన రెండు ఎన్నికల్లోనూ తానే పార్టీకి, ప్రభుత్వానికి రధసారధినన్న చరిత్ర ఆయన మర్చి పోయినట్లున్నారు. అదేమి విచిత్రమో - ఆయన ముఖ్యమంత్రి అయిన రెండు సార్లూ పార్టీని రాష్ట్రంలో ప్రజలు తిరస్కరించారు. కనీసం ప్రతిపక్షానికి అర్హత కూడా లేకుండా ఛీ కొట్టారు.

పార్లమెంట్ ఎన్నికలలో కాంగ్రెస్ ఓటమికి నైతిక బాధ్యత వహించి; జెఎంఎం ముడుపుల కేసులో తనపై ఎఫ్ఐఆర్ దాఖలైనందు వల్ల నిందితుడిగా చట్టాన్ని గౌరవించి ఎఐసిసి అధ్యక్ష [illegible] తప్పుకోమని పివి నరసింహా రావు గారిపై వత్తిడి వస్తున్నది. ఆంధ్ర కాంగ్రెస్ నాయకులు కూడా పివిని తప్పించే ప్రయత్నాలకు వత్తాసు పలుకు తున్నారు. రేపు జూలై మొదటి వారంలో జరుగనున్న సమావేశంలో ఈ విషయమై ఆయన్ను విమర్శకులు, అసంతృప్త వాదులు ఉక్కిరి బిక్కిరి చేయవచ్చు. ఆ పదవి తనకు కావాలని విజయ భాస్కర రెడ్డి గారు - అదేదో చిన్న పిల్లలు తాయిలం అడిగినంత సులువుగా అడిగేశారు. అందుకు ఆరాట పడ్తున్నారు కూడా!

ఆయన ప్రయత్నం చూసి తతిమా కాంగ్రెస్ నాయకులు నివ్వెర పోయారు. వారికి నోటమాట రాలేదు. ఆంధ్ర నుంచి మాజీ మంత్రి శ్రీ జి. వెంకటస్వామి ఒక్కడే ఇప్పటికి నోరు విప్పి మాట్లాడి నప్పటికీ, ఇతర రాష్ట్ర నాయకులు సైతం ఈ ప్రతిపాదన పట్ల సుముఖంగా లేరు. రాష్ట్రంలోనే పార్టీ పెద్దలతో సఖ్యతగా మెలగలేని విజయ భాస్కర రెడ్డి జాతీయ పార్టీ పగ్గాలు పట్టుకొంటే కాంగ్రెస్ ముఠాలు, వర్గాలుగా చీలిపోయి భ్రష్టు పట్టి పోదా అన్నది - ఆయన తత్వం తెలిసిన వారందరి ప్రశ్న. కర్నూలు జిల్లాలో

కొరవ 8 పేజీలో

# హోటల్ శివప్రియ ఏ.సి.

పొగతోట సెంటర్, ట్రంకురోడ్డు, నెల్లూరు. ఫోన్లు: 27111, 27112, 27113, 27114









25.6.1996 తేది

**8**

వ వార్షికోత్సవం
శుభ సందర్భంలో

మరింత అందంగా శోభాయమానంగా తీర్చిదిద్దడమే కాదు-
మరిన్ని గదులతో విస్తరణ జరుపుకొని మీ సేవకై పునరంకితమౌతున్నది.
నెల్లూరులో మరే హోటల్‌లోను లేని ఇండోర్ కార్ పార్కింగ్ సౌకర్యం అదనపు ఆకర్షణ.
శుచి, శుభ్రత, సర్వీసు శివప్రియ సహజ సేవలే కదా!

## రండి, ఆతిధ్యం స్వీకరించండి

24 గంటలు వేడి నీటి సదుపాయము
ప్రతి రూముకు స్టార్ టి.వి. కనెక్షన్
లిఫ్ట్ సౌకర్యం



వ్యవస్థాపకులు
చెరుకుపల్లి పిచ్చిరెడ్డి



చెరుకుపల్లి పద్మనారాయణరెడ్డి
మేనేజింగ్ పార్టనర్

# అరసాగర మథనం

దివాలా స్థితిలో వున్న రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను పరిరక్షించుకోను ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు ప్రారంభించిన చర్చా వేదికలు ఎంతో రాజకీయ ప్రజ్ఞతో కూడుకున్నవి. రాజకీయంగా తన పదవికి, ప్రతిష్టను కాపాడు కొంటూనే రాజకీయంగా కంటగింపు కల్గించే కఠిన నిర్ణయాలు తీసుకునేందుకు ఈ ఉపాయం కనిపెట్టాడాయన. పత్రికా విలేకరులు, సంపాదకులు, మేధావులు, ప్రతిపక్ష రాజకీయ వాదులు తదితర వర్గాల ప్రజలను చర్చలో భాగస్తుల్ని చేయడం ద్వారా రేపు వారి నుంచి విమర్శలు తలెత్త కుండా జాగ్రత్త పడుతున్నారు. కత్తి మీద సాము చేయక తప్పని పరిస్థితి ఏర్పడి నప్పుడు కాళ్లు • తెగకుండా ఎటువంటి మెళుకువ పాటించాలో తెలుసుకో జూడడం విజ్ఞతే కదా!

రాష్ట్రం దివాలా స్థితికి ప్రధానంగా రెండు కారణాలు కన్పిస్తున్నాయి. ఒకటి – ఓట్ల కోసం అమలు చేసిన సబ్సిడీ బియ్యం, విద్యుత్ రాయితీ, మద్య నిషేధం వంటి పథకాలు; రెండు – పూర్వపు ప్రభుత్వాలు ఒళ్లు తెలియ కుండా చేసిన అప్పులు. ఈ ఏడాది బడ్జెట్ అంచనాల ప్రకారం ఆదాయం 11150 కోట్లయితే – అందులో సబ్సిడీ బియ్యం (1308), విద్యుత్ రాయితీ (1530), వడ్డీ చెల్లింపు (1890) లకు 4728 కోట్లు హరించుకు పోతున్నాయి. ఇది మొత్తం ఆదాయంలో 42.40 శాతం. జీతభత్యాలకు 5410 కోట్లు వ్యయ మౌతున్నాయి. ఇది 48.5 శాతంతో సమానం. విద్యుత్ సబ్సిడీ లెక్కల్లో కన్పడదు. అది విద్యుత్ బోర్డు నష్టాలలో దాగి వుంటుంది. జీతభత్యాల పద్దులో విద్య, పోలీసు, వైద్యం వంటి విభాగాలలోని వారికిచ్చే జీత భత్యాలు కలవ లేదు. లెక్క వేస్తే అవి మరొక వెయ్యి కోట్లకు పైమాటే. దీని ప్రకారం మొత్తం బడ్జెట్ జీతాలకు, సబ్సిడీలకు సరిపోతున్నది. ఇతర నిర్వహణ ఖర్చుల కోసం 2920 కోట్ల రూపాయలు అప్పు చేస్తున్నారు. అప్పు చేసిన డబ్బుతో నీటి పారుదల పథకాల వంటి వాటికి పెట్టుబడి పెడితే శిస్తు వసూలు ద్వారా ఆదాయం సమకూరు తుంది. కాని ఆ సొమ్మును జీతాలకు, నిర్వహణ ఖర్చులకు వాడడం వల్ల వడ్డీ చెల్లింపులు అధిక భారమై పోతున్నాయి.

ఇంకొక ప్రక్క పన్నుల వసూలు, రాష్ట్రంలో జరిగే అభివృద్ధితో పోలిస్తే చాలా స్వల్పం. కొన్ని మిలియన్ హెక్టార్ల భూమి సాగులో వున్నప్పటికి వసూలౌతున్న భూమి శిస్తు కేవలం 57 కోట్లు. అమ్మకం పన్నులు కేవలం 2900 కోట్లే వసూలైనాయి. కనీసం 1500 కోట్ల ఆదాయం కల్పించే ఎక్సైజ్ – మద్య నిషేధం వల్ల మాయమై పోయింది. సినిమాలకు 40 కోట్లు సబ్సిడీ ఇచ్చారు; వసూలైన వినోదపు పన్ను మాత్రం కేవలం 67 కోట్లు.

అటు సబ్సిడీలు, రాయితీలు, వడ్డీల ఖర్చు పెరిగిపోయి; ఇటు పన్నుల వసూలు తగ్గి పోతుంటే రాష్ట్రం దివాలా తీయక ఏమౌతుంది? ఇందులో ఏ మార్పు చేసినా రాజకీయంగా సంకటమే. సబ్సిడీ బియ్యం, మద్య నిషేధం పథకాలు కొనసాగిస్తామని మొన్నటి పార్లమెంటు ఎన్నికలలో కూడా ప్రచారం చేశారు చంద్ర బాబు. ఇప్పుడు వాటిని సడలించడం ప్రజల విశ్వాసాన్ని వమ్ము చేయడమే. కాని సడలింపు జరపకుంటే ప్రభుత్వ మనుగడ అసాధ్యం. ప్రజలలో పెద్ద వ్యతిరేకత ఎదురు కాకుండా ఈ కఠిన నిర్ణయం తీసుకునేందుకే చంద్ర బాబు దీనిపై చర్చ ప్రారంభించారు. చాలా తెలివైన నిర్ణయమిది. ఇప్పట్లో ఎన్నికలు లేవు కాబట్టి, ప్రజలలోని అసంతృప్తి వ్యవస్థీకృతమై, దాని ప్రభావం ప్రభుత్వంపై ప్రతిఫలించే అవకాశం లేదు. పత్రికలలో, రాజకీయ వాదులు జరిపించే ఆందోళనా కార్యక్రమాలలోనే విమర్శలు వ్యక్తం కావాలి. ఆ వర్గాలను శాంతింప చేయడానికే చంద్రబాబు ఈ ప్రయోగం చేస్తున్నారు. నిజానికి ప్రభుత్వం తీసుకోబోయే నిర్ణయాలకు, ఈ చర్చకు సంబంధం వుండదు. దీని పాటికిదే, దానిపాటికదే!

**జమీన్‌రైతు**

అయితే ఏడాదిన్నర తిరగక ముందే మద్య నిషేధం సడలించడం సమంజసమా అన్నది ప్రశ్న. ఆర్థికంగా దీనివల్ల నష్టం సంభవిస్తున్నప్పటికీ; దొంగ మద్యం ప్రవాహం వలె రాష్ట్రమంతటా ప్రవహిస్తు న్నప్పటికీ మద్య నిషేధం కొన్ని లక్షల కుటుంబాలలో మార్పు తెచ్చింది. మద్యానికి బానిసలైన వారు తప్ప – అంతగా అలవాటు పడని వారు ఆ వ్యసనాన్ని వదులుకో గలిగారు. పోలీసు భయమో, దొంగ మద్యం ఖరీదు భరించే స్తోమత లేకనో దాన్ని మర్చి పోయిన వారిని మళ్లీ మత్తుకు బానిసలుగా మార్చడం అన్యాయం. మద్య నిషేధం విజవంత మైందో లేక విఫలమైందో తెలుసు కోవడానికి ఈ స్వల్ప వ్యవధి చాలదు. మరింత కాలం వేచి చూడాలి.

కేవలం ఆర్థిక కారణాలతో మద్యాన్ని అనుమతించడం తప్పు. దానివల్ల వచ్చే ఆదాయపు లోటును ఇతర మార్గాల ద్వారా పూడ్చుకోవ డానికి ప్రయత్నించాలి. మనసుంటే మార్గం దొరకక పోదు.

**జమీన్‌రైతు**

**జమీన్‌రైతు**

21-6-96

పేజీలు:6 వెల:0-1-6

### ఆయుష్మాన్భవ!

ఇంగ్లాండు నుండి సురక్షితంగా మాతృభూమిలో అడుగు బెట్టిన ఆంధ్రరాష్ట్రాధిపతి ఆచార్య రంగా గారికిదే మా హృదయపూర్వక సుస్వాగతము!

### పోస్టుకార్డ్ ధర తగ్గింపు

పోస్టుకార్డు జూలై 1తేది నుండి 0-0-6 చేయబడింది. ఆతేది నుండి 0-0-9 కార్డులున్న వారు పోస్టాఫీసులో వాపు ఇచ్చి అర్థణా కార్డులు కొనుక్కోవచ్చు.

### జమీందారీ రద్దు యిపుడుకాదా?

ఆఖరుకు ప్రకాశం దిట్టినాగతి? కొండంత రాగం తీసి తుమ్మెదియలో అన్నట్లు ఇన్నాళ్ళు ఏమేమో మనం వ్రేగల్పాలు గొట్టి విషయం కడకు తుస్సుమనబోతున్నది.

కావున జమీన్‌రైతులంతా మెళ్కొని ఐక్యంతో తక్షణం ఆందోళన సాగించి తగు కృషి చేయుట అత్యవసరము.

### జమీందారీలు రద్దవుతాయి!

జమీన్‌రైతులకు రాజేంద్రబాబు అభయం. "కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళికలో 'పరిహారమిచ్చి జమీందారీలను రద్దు పరచటం' అనేది ఒక హంశము. దీన్ని కాంగ్రెస్ మంత్రి వర్గాలు అమలు జరుపుతాయని ధైర్యంగా వుండవచ్చు. జమీందారి రద్దుకు కాంగ్రెసు విముఖంగాదని గట్టిగా చెప్పగలను"( బీహార్ రాష్ట్ర కాంగ్రెస్ సంఘ సభలో ప్రసంగం)

### గిరిగారి నెల్లూరు ఆగమనం

కాంగ్రెసు మంత్రి వివి.గిరి గారు (వరాహ వెంకటగిరి) 14 తేది ఉదయం బండిలో తెనాలి నుండి విచ్చేశారు. వియ్యంకులు రాఘవయ్య యింటి వద్ద బస. గంగపట్నం.

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

ఇందుకూరుపేట కోఆపరేటివ్ స్టోరుల ప్రారంభోత్సవం జరిపిరి. వ్యాపారస్థులకు మంచి మాటలు వినిపించిరి. మోటారు కార్మికులను సమరసంగా వ్యవహరించమని ఉద్బోధించిరి.

### నెల్లూరు ముచ్చట్లు

భక్తవత్సలం గారొచ్చినపుడు కనుపూరు కాల్వ సభలో మంత్రి మెడలో దండల ద్వారా అలంకరించిన 70 బారల ఖద్దరు నూలు షుమారు ధనం రు100 లు క్రయంబోసేది జిల్లా కాంగ్రెస్ కమిటీకి చెందవలసి యుండగా, నిరంకుశపు అసిస్టెంటు

కొరవ 8 పేజీలో

# రెండే పార్టీలుంటే చవకబారు రాజకీయం అదృశ్యమవుతుంది!

స్థిరత్వం లేనిదే పరిపాలన లేదు. అభివృద్ధి లేదు; శాంతి భద్రతల సమస్యలు తలెత్తుతాయి. మొన్నటి ఎన్నికల్లో పలు అవినీతి కుంభ కోణాల మధ్య ఏ పార్టీ మీదా ఓటరు నమ్మకాన్ని వుంచలేక పోయాడు. ప్రాంతీయ పార్టీల పోకడల వల్ల అక్కడక్కడ జాతీయ జీవన స్రవంతికి విఘాతం కలుగు తుందనేది నిజం. రాజకీయల్లో చీప్ పాపులారిటీకి ప్రాకులాడుతూ ప్రవేశ పెట్టిన పథకాల వల్ల ఆంధ్రప్రదేశ్‌లో ఖజానా దివాలా తీయడం నేటి రాజకీయాల తీరును సూచిస్తున్నాయి. దేశం దివాలాకోరు తనం నుండి బయట పడాలంటే రెండే రెండు రాజకీయ పార్టీలు వుండే వ్యవస్థ కావాలి. అందుకోసం రాజ్యాంగాన్ని సవరించాలి.

నెల్లూరు జి.మునిరెడ్డి

### జమీన్‌రైతుకు జంకే స్వభావం లేదు!

జమీన్‌రైతు వ్యతిరేక నినాదాలతో నెల్లూరులో మార్కెటింగ్ మంత్రి టి.రమేష్‌రెడ్డి తన అనుచరులతో ప్రదర్శన జరిపించడం సబబుగా లేదు. ఆ పత్రిక నిర్భయంగా వ్రాసే వార్తలను ప్రజలు ప్రగాఢంగా విశ్వసించబట్టే అసెంబ్లీ ఎన్నికల్లో రమేష్‌రెడ్డి ఎమ్మెల్యేగా గెలవగలిగారు. రమేష్ రెడ్డి మధ్య తరగతియుడని ప్రకటించి మద్దతుగా నిలిచిన ఏకైక పత్రిక జమీన్‌రైతు అనే విషయాన్ని మర్చి పోవడం రమేష్‌రెడ్డికి తగదు. పత్రికల్లో వచ్చిన వార్తపై స్పష్టమైన వివరణ పంపకుండా దుందుడుకుగా నోటీసివ్వడం మంత్రి స్థాయికి తగిన పనులని అనిపించు కోలేవు. స్వర్గీయ ఎసి సుబ్బారెడ్డి, పుచ్చలపల్లి రామచంద్రారెడ్డి, నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి వంటి వారే ఇంతకు మునుపు ఈ పత్రిక మీద ధ్వజమెత్తినా ఏనాడూ జంక లేదు. నిర్భయంగా

**జనవాణి**

నిజాలు వెల్లడిస్తూ ప్రజల మద్దతుతో సాగే పత్రికగా పేరు తెచ్చుకొంది. పత్రికను విమర్శిస్తూ అప్పుడప్పుడు తెరపైకి వచ్చి వెళ్లే రాజకీయ నాయకులే తెరమరుగై పోతున్నారు.

గూడూరు ఆవులకొండయ్య

### కాంగ్రెస్‌తో పరిష్వంగం నేరమా?

జూన్ 6 తేది జమీన్‌రైతు సంచిక జనవాణి శీర్షికలో పి.యం.కె. గాంధీ '13 పార్టీల పాలన ఎన్నాళ్లు' అంటూ వ్రాశారు. కత్తులు దూసిన నేతలు మళ్లీ ఆపార్టీనే గాఢ పరిష్వంగనం చేసు కొన్నారని విమర్శించారు. కాని దేశ ప్రయోజనాల కన్నా ఏ రాజకీయ పార్టీల సిద్ధాంతాలు గొప్పవి కావన్న నగ్న సత్యాన్ని విస్మరించారాయన. బిజెపి 'అంతరాత్మ ప్రబోధం' నినాదం పనిచేసి, కాంగ్రెస్ నుంచి కొందరు బయటకు వచ్చి వుంటే వారిని నిజాయితీ పరులంటూ ఆ పార్టీగాఢ పరిష్వంగం చేసుకొని ఉండేది. చాలినంత సంఖ్యా బలం లేకుండా

కొరవ 10 పేజీలో

# వానల్లోనే చూడాలి, నెల్లూరు నగర సౌందర్యం!

12 తేది నుంచి 15 తేది వరకు కురిసిన వర్షాల్లో నెల్లూరు టౌన్ రోడ్లు, డ్రైనేజిల విషయం తెలియని వారెవరైనా అది వెన్నెనది వెల్లునో, చెరువు నీటి వరదో ముంచు కొచ్చి టౌన్‌లో పొంగి పొర్లి పుంటాయని భ్రమ పడి వుంటే, అది వారి తప్పు కానేకాదు. మోకాలు లోతు పారుతుండే మురికి మునసబ్బు నీళ్లలో జామ్ అంటూ పాగే టౌన బస్సులు, కార్లు, స్కూటర్ల మధ్య బిక్కు బిక్కు మంటూ తిరిగిన పాదచారుల శాపనార్థాలకు శక్తి అంటూ వుంటే మునిసిపల్ అధికారులు ఆ మురుగు వైతరణిలోనే జల సమాధి అయి వుండేవారు.

ఏ వీధి చూసినా ఏ మున్నటి గర్భకారణ మన్నట్లు వీధుల్లో డ్రైనేజి మురికి నదుల వెల్లువలే. ఆక్రమణ కారిన పడి టౌన్‌లోని డ్రైనేజి కాల్వలన్నీ పూడిపోవడంతో కాసిన్ని చినుకులు పడగానే డ్రైనేజిల పొట్టపగిలి మురుగు నీరు రోడ్లలో వరదగా పారుతున్నాయి. నాసికా రంధ్రాలు పగిలి పోయే కుళ్లు కంపు.

ట్రంకు రోడ్డులోని గాంధీ బొమ్మ వద్ద మోకాటి లోతు నీళ్లు నిలిచి ఆ ప్రాంతం చిన్న నదిలా దర్శన మిచ్చింది. కాసింత ముందుకు పోతే న్యూటాకీస్ వద్ద కూడా అదే పరిస్థితి. ఆత్మకూరు బస్టాండ్ అండర్ బ్రిడ్జి గూర్చి ఇక వర్ణించ నవసరం లేదు. జెమ్స్ గార్డెన్‌లో బైపాసు రోడ్డు అనబడే రోడ్డు పై నడిచిన ఎన్ని వాహనాలు పెద్దకు చేరాయో! కెవి సుబ్బారెడ్డి పెట్రోల్ బంకు ప్రాంతాల్లో ఈ మధ్య నాలుగు చినుకులు పడితే చాలు ఒక చిన్న వాగు ప్రవహించి ట్రాఫిక్ ప్రక్క త్రోవ పట్టాల్సి వస్తున్నది.

వర్షాల్లో చిన్న బజారులోని

*వీధులే మురికి*
*సెలయేరులై డ్రైనేజి*
*పైపుల పొట్ట పగిలి,*
*కుళ్లు కంపు సర్వత్రా*
*వ్యాపించి, మురిగిన*
*బురద మోకాటి*
*లోతున పేరుకొనిపోయి*
*నెల్లూరు నగర భామ*
*పౌరులను ఎంత*
*"సుఖ" పెట్టిందీ*
*వర్ణించ తరంకాదు!*

మెయిన్ రోడ్డు, కూరగాయల మార్కెట్ ప్రాంతం, గర్భివీధి, కాపు వీధి, తిప్పరాజు సత్రం గోడ ఎదురు సందుల్లో అందాలు వర్ణించ లేం. ప్రపంచంలో ఎక్కడా చూడని వస్తువులన్నీ డ్రైనేజి నీళ్లలో ప్రత్యక్షమై చూసే వారికి భళ్లున వాంతి వచ్చేస్తుంది.

టౌన్‌లోని ప్రధాన ప్రాంతాలే ఇలా వున్నాయి; శివారు ప్రాంతాలు ఏం చేస్తామని నాయకులు చెప్పవచ్చు. కాని మొన్నటి వర్షాలకు బాలాజీ నగర్, జాకీర్ హుసేన్ నగర్, కోటమిట్ట, గాంధీ నగర్, మన్సూర్ నగర్, మూలపేట వేణుగోపాల స్వామి దేవస్థానం దిగువ ప్రాంతీయులు ఇళ్లలోకి నీళ్లు వచ్చి పడరాని పాట్లు పడ్డారు.

ఇవి తుఫాన్ వర్షాలు అని సాకు చెప్పి అధికారులు, నాయకులు తప్పించు కోవచ్చు. కాని ఎప్పుడు వానలు పడినా ఇదే దుస్థితి తప్పదు. రాబోయేది వర్షాకాలం కాబట్టి ఇప్పటి నుంచే డ్రైనేజి కాల్వల్లోని సిల్ట్ తీసి నీరు పోయేందుకు అడ్డంకులు లేకుండా చేయా. డ్రైనేజి ప్రధాన కాల్వలు ఎక్కడ ఏ పెద్దల మూలంగా మూత పడ్డాయో వాటికి మోక్షం కలిగించి, మురికి నీరు పోయే మార్గం చూపించాలి. లేకుంటే అంటు వ్యాధులతో వర్షాకాలంలో టౌన్ ప్రజలు అల్లాడి పోవడం ఖాయం.

## స్వర్ణా వేమయ్య వర్థంతి సభ

మాజీ ఎమ్మెల్యే స్వర్ణా వేమయ్య వర్థంతి సభ 16 తేది అంబేద్కర్ భవన్‌లో జరిగింది. రాష్ట సెకండరీ విద్యా

కొరవ 11 పేజీలో



బి. శ్రీహరిరెడ్డి, డా. క్రిష్ణవేణిల కుమార్తె డాక్టర్ సుమిత, డాక్టర్ శ్రీనివాస్ వీరి వివాహం నెల్లూరులో జరిగింది

## సణుగుడు

* శకుని మామ ఏదో కొత్త పాచిక విసుర్తున్నారు!
* కాంగ్రెస్ వాదులందరికీ థ్యాంక్స్!

జిల్లా కాంగ్రెస్ భారతంలో శకుని మామగా సుప్రసిద్ధులైన మేగౌర ఏదో కొత్త పాచిక విసుర్తున్నారు. పదవి కుర్చీలో కూర్చుని మసాల వడలు ఆరగించే సమయంలో ఏదో పురుగు ఆయన మానసాన్ని తొల్చి నట్లుంది. లేకుంటే సిద్ధార్థుడికి పలె జ్ఞానోదయమేదైనా జరిగిందేమో తెలియదు. ఒక్క సంతోష మేమిటంటే — ఎప్పుడూ లేనిది ఈసారి శుభ సంకల్పం కల్గడం. సాధారణంగా ఆయన ఆలోచనలు విధ్వంస వ్యూహ రచనలోనే పరిభ్రమి స్తుంటాయి. చీలికలను పలవరి స్తుంటాయి. అటువంటి మానసంలో కలయిక సంకల్పం కల్గడం శుభ సూచకమే కదా?

రాజకీయంగా మాజీ ముఖ్య మంత్రి శ్రీ జనార్దన రెడ్డికి అమడ దూరంలో మసలుతున్న మాగుంట కుటుంబీకులను దగ్గరకు చేర్చాలనే ప్రయత్న మొకటి మేగౌర నుంచి ప్రారంభమైంది. జిల్లా కాంగ్రెస్‌లో ఇప్పుడు వారొక్కరు ఉలిపి కట్టెల పలె వ్యవహరిస్తున్నారు. తతిమా వర్గాలన్నీ జనార్దన రెడ్డి గారిని అనుసరిస్తున్నాయి.

### డోలేంద్ర

దాదాపు ఏక నాయకత్వం చలామణిలో వుంది కాంగ్రెస్ పార్టీలో ఇప్పుడు. మాగుంట సుబ్బరామ రెడ్డిగారు బ్రతికి వుంటే పరిస్థితి ఎట్లుండేదో కాని — ఆయన మరణంతో వారి వర్గ రాజకీయపు వేడి, వాడి తగ్గిపోయాయి. నెల్లూరు మునిసిపాలిటీకి, కావలి యానాది రెడ్డి గారికి పరిమితమై పోయింది వారి రాజకీయ కార్యకలాపం. ముక్కాని లేని

కొరవ 7 పేజీలో

# పిల్లలందరికీ చదువు — కొత్త శతాబ్దానికి కొత్త ఉద్యమం!

దేశంలో పోలియో చుక్కల కార్యక్రమం విజయ వంతమైన స్ఫూర్తితో ఈ ఏడాది జూలై 22 నుండి 27 వరకు దేశవ్యాప్తంగా పాఠశాలల్లో ఆరోగ్య పథకం కార్యక్రమాన్ని నిర్వహించాలని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఈ పథకంలో భాగంగా ప్రాథమిక పాఠశాలల్లో చదువుతున్న పిల్లలందరినీ పరీక్షించి చికిత్స చేస్తారని జిల్లా కలెక్టర్ డాక్టర్ డి.సాంబశివరావు చెప్పారు. 15తేది కలెక్టర్ ఛాంబర్‌లో జిల్లా వైద్య ఆరోగ్య, విద్యా, గిరిజన సంక్షేమ శాఖాధికారులు, స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులతో సమావేశం ఏర్పాటు చేసి మాట్లాడా రాయన. ఈ పథకం ద్వారా ప్రాథమిక పాఠశాలల్లో చదువుతున్న 6 నుంచి 11 సంవత్సరాలలోపు పిల్లల ఆరోగ్యం మెరుగు పడుతుందన్నారు. ఈ కార్యక్రమాన్ని మూడు దశల్లో నిర్వహిస్తారట. మొదటి దశలో ఎ.ఎన్.ఎం, ఇద్దరు టీచర్లు, వాలంటీర్లతో కలసి పాఠశాలలను సందర్శించి పిల్లలను పరీక్షిస్తారు. పిల్లలోని చిన్న చిన్న రుగ్మతలను గుర్తించి వాటికి చికిత్స చేస్తారు. చికిత్స చేయలేని వ్యాధులున్న పిల్లలను పి.హెచ్.సి డాక్టరుకు సిఫార్సు చేస్తారు. రెండవ దశలో పి.హెచ్.సి డాక్టరు తన స్థాయిలో తగ్గించ గలిగే జబ్బులకు చికిత్స చేస్తారు. చికిత్స చేయలేని వాటిని ఆగష్టు 1 నుండి 10 వరకు నెల్లూరులోని ప్రభుత్వ ఆసుపత్రిలో పరీక్షలు జరిపి చికిత్స చేస్తారు. మూడవ దశలో స్పెషలిస్టు చికిత్స చేసి అవసరమైతే వారిని సూపర్ స్పెషాలిటి ఆసుపత్రులకు పంపిస్తారని కలెక్టర్ వివరించారు. మొత్తం అన్ని దశల్లోనూ వైద్యం పుచితంగా జరుగుతుంది.

ఈ పథకం ప్రచారం కోసం 20వేల కరపత్రాలు 500 బ్యానర్లు సిద్ధం చేసినట్లు చెప్పారు. సమావేశంలో జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ ఊర్మిళ, ఇన్‌ఛార్జి డి.ఇ.ఒ. నాగేశ్వరరావు తదితరులు పాల్గొన్నారు.

## నెల్లూరు సంగతులు

### వక్ఫ్ బోర్డు కమిటీ వేస్తు

జిల్లాలో కోట్లాది రూపాయల వక్ఫ్ బోర్డు ఆస్తులను బోర్డు కమిటీ ఇప్పటి వరకు ఏ మాత్రం కాపాడ లేదని కొందరు ముస్లిం నాయకులు ఆరోపించారు. ఫత్తేఖాన్ పేట కలాం మసీదుకు చెందిన సరస్వతి నగర్‌లోని కోట్లాది రూపాయల భూమిపై కోర్టు తీర్పును నాయకులు అమలు పరచ లేకపోయినట్లు చెప్పారు. ఇక్కడి ప్రముఖుల ఇళ్లు వున్నాయని వక్ఫ్ కమిటీ చేతులుడిగి వుండి పోతుపోతున్నదని ఈ నాయకుల వాదన. బారాషహీద్ దర్గా స్థలం దుర్వినియోగం కాకుండా చూడాలని, రొట్టెల పండుగ సందర్భంగా వచ్చిన మొత్తాన్ని నెల్లూరు, హైదరాబాదు బ్యాంకుల్లో వేసే బదులు దర్గాకు వచ్చే యాత్రికులకు సౌకర్యాలు కల్పించాలని కోరారు. సమావేశంలో మహమ్మద్ అజ్మతుల్లా, ఇబ్రహీం తదితరులు పాల్గొన్నారు.

### లయన్స్ క్లబ్‌కు నూతన కార్యవర్గం

నెల్లూరు లయన్స్ క్లబ్, లయన్స్ క్లబ్ సేవాప్రియ, లియోక్లబ్ నూతన కార్యవర్గాల పదవీ ప్రమాణ

కొరవ 11 పేజీలో

# 15 చెరువులకు గండ్లు — ఏడు నిండు ప్రాణాలకు చెల్లు!

తుఫాను కారణంగా 12 తేది నుంచి 15 తేది వరకు కురిసిన భారీ వర్షాలకు కనపర కుండానే నష్టాలు సంభవించాయి. 40 హెక్టార్లలో వరినాగు, 50 హెక్టార్లలో వరి నైరు, 5 హెక్టార్లలో సజ్జలు, 15 హెక్టార్లలో మొక్కజొన్న, 520 హెక్టార్లలో పత్తి, 59 హెక్టార్లలో వరి తోటలు, 250 హెక్టార్లలో కూరగాయల పంటలు నాశనమై పోయాయి. 15 చెరువులు తెగిపోగా, 43 ఇరిగేషన్ వనరులు దెబ్బ తిన్నాయి. ఓజిలి, తక్కెలి, సూళ్లూరు పేట, ఇందుకూరు పేట, కోట, వెంకటగిరి మండలాల్లో 71 ఇళ్లు పాక్షికంగా, 58 ఇళ్లు పూర్తిగా దెబ్బతిన్నాయి. 26 రోడ్లు, 14 భవనాలు, 76 పశువులు, ఏడుగురు వ్యక్తులు తుఫాన్‌లో చనిపోయారు. ఈ నష్టాల విలువ 44.1 కోట్లుగా కలెక్టర్ లెక్కగట్టి తక్షణ సాయం అందించాలని రిలీఫ్ కమీషనర్ బ్రహ్మకు ఫ్యాక్స్ సందేశం పంపారు.

### జిల్లాలో తుఫాన్ నష్టాలు

## ఆర్టీసి కార్మికుల నిరసన!

నెల్లూరు ఆర్టీసి 2 డిపోలో కండక్టర్‌గా పనిచేస్తున్న ఐ.హెచ్.ఎన్. రెడ్డిని కారణం లేకుండా సస్పెండ్ చేయడాన్ని రీజియన్ ఎంప్లాయిస్ యూనియన్ నిరసించింది. 17 తేది రీజనల్ కార్యాలయం ఎదుట ధర్నా చేసి, తరువాత టౌన్‌లో కార్మికులు ఒక ప్రదర్శన చేశారు. కార్యక్రమానికి ఆర్టీసి ఎంప్లాయిస్ యూనియన్ నాయకులు పి. సుబ్బయ్య, పి. మురళీధర రావు, ఎ.ఎం. కుమార్, డి. దయాకర్, బి.సి.ఎన్. రావు నాయకత్వం వహించారు.

# కావలి కరెంట్ షాక్ -

## అదనపు డిపాజిట్ల పేరుతో హడలగొట్టేస్తున్నారు!

కావలి టౌన్‌లో గత ఇరవై రోజుల నుంచి అదనపు డిపాజిట్లు, డెవలప్ మెంట్ ఛార్జీల పేరిట విద్యుత్ శాఖ వేల రూపాయల వడ్డింపులతో ఇస్తున్న బిల్లులు చూసి ప్రజలు బెంబేలెత్తి పోతున్నారు. కావలి టౌన్‌లో ఈ రూపేణ కనీసం కోటి రూపాయలు వసూలు చేసేందుకు విద్యుత్ శాఖాధికారులు నిశ్చయించుకున్నట్లు విశ్వసనీయంగా తెలిసింది. గత వారం రోజులుగా 22 బృందాలు టౌన్‌లోని చిన్నా, పెద్ద అంగళ్లకు వెళ్లి ఒక్కొక్కరికి 2 నుంచి 10 వేల వరకు బిల్లులు కట్టమని నోటీసులు జారీ చేశారు. వారకం వెయ్యి వాట్లు వున్నట్లయితే రెండు వేల రూపాయలు చెల్లించాలి. అదే విధంగా 5 వేల వాట్లు వినియోగించే వారు 10 వేల రూపాయలు చెల్లించాలని తాఖీదు లిచ్చారు. 30 రోజుల్లో ఈ డబ్బు కట్టకపోతే కరెంట్ కనెక్షన్ తీసివేస్తామని అధికారులు బెదిరిస్తున్నారని వ్యాపారులు వాపోతున్నారు.

ఇప్పటి వరకు అంగళ్లపై దాడి చేసి ఈ విధమైన వడ్డింపులు వేస్తున్న అధికారులు ఇళ్లకు ఎక్కడ వస్తారోనని హడలి పోయి అదనపు లైట్లు, ఐరన్ బాక్సులు, మిక్సీలు దాచివేస్తున్నారు. బాడుగ ఇళ్లలో వున్న వారికి సొంత దారులకు ఈ విషయంలో అప్పుడే గొడవలు మొదలయ్యాయి. కాని ఇన్నాళ్లు విద్యుత్ శాఖ ఈ విషయమై ఎందుకు ఊరుకొన్నట్లు? లోడును బట్టి ఎప్పటి కప్పుడు ఎందుకు డిపాజిట్లు కట్టించు కోలేదు?

### తప్పు విద్యార్థిది శిక్ష ప్రొఫెసర్‌ది?

కావలి పిజి సెంటర్ స్పెషలాఫీసర్ డాక్టర్ జి. రాఘవ రెడ్డిపై సద్గుణ రావు దుర్గుణాల పుట్ట వంటి పాత విద్యార్థి హత్యాప్రయత్నం చేశారు; కిరాతకంగా తలనరికి చంప బోయారు.

సద్గుణ రావు మూడేళ్ల క్రితం పిజి సెంటర్ విద్యార్థిగా వున్నప్పుడు ఏదో పేచీవచ్చి ఆయనపై తనను కులం పేరిట దూషించారని కేసు పెట్టారు. అప్పుడు దళిత సంఘాలు జోక్యం చేసుకొని రాఘవ రెడ్డి తప్పు లేదని తేల్చి కేసు విరమింప జేశారు. దీనితో కోపం పెంచుకొన్న సద్గుణ రావు గత సంవత్సరం ప్రొఫెసర్‌ను కత్తితో బెదిరించడంతో పాటు చెప్పుతో కొట్టి అవమాన పరిచాడు. దీన్ని కూడా రాఘవ రెడ్డి క్షమించి నప్పటికీ ఆయన శిష్యుడైన అప్పటి కడప కలెక్టర్ సుబ్రహ్మణ్యం జోక్యం చేసుకొని సద్గుణ రావును అరెస్ట్ చేయించాడు. రెండు

కొరవ 7 పేజీలో

వర్షాలకు ముంపుకు గురైన నెల్లూరు టౌన్ మన్సూర్ నగర్‌లోని నష్టాలను మార్కెటింగ్ మంత్రి టి. రమేష్ రెడ్డి పరిశీలిస్తున్న దృశ్యం. చిత్రంలో శ్రీదేవి, మునిసిపల్ కమిషనరు రామసుబ్బారెడ్డి

# బుచ్చి మిల్లులో దాచిన విజిలెన్స్ సరకు మాయం?

విజిలెన్స్ శాఖ అధికారులు పట్టుకొని ఒక మిల్లులో జాగ్రత్త చేసిన 2 లక్షల రూపాయలకు పైగా విలువ కలిగిన సరుకు మాయమై పోయింది. ఈ గోల్‌మాల్‌లో నిందితుడు ఒక ప్రముఖ పార్టీకి చెందిన నాయకుడు కావడంతో అధికారులు కక్కాలేక, మింగాలేక సతమతమై పోతున్నారు.

గత సంవత్సరం మార్చి నెలలో విజిలెన్స్ ఇన్స్పెక్టర్ బుచ్చిరెడ్డి పాళెంలోని విజయలక్ష్మి ట్రేడర్స్, మలా ఆయిల్ మిల్లులపై దాడులు చేసి 900 కేజీల ప్రొద్దు తిరుగుడు పూల నూనె, 25 బస్తాల విత్తనాలు 142 బస్తాల వేరుశనగ కాయల పప్పు, 5 బ్యారల్ల వేరుశనగ నూనె స్వాధీనం చేసుకొన్నారు. ఆ సరుకు మొత్తాన్ని ఒక రైసు మిల్లులో భద్ర పరిచారు. దాడి జరిగిన తరువాత విజయలక్ష్మి ట్రేడర్స్ వారు తమ సరుకును వేలం వేయకుండా హైకోర్టుకు వెళ్లి స్టే కూడా తెచ్చుకొన్నారు. నవంబరులో జాయింట్ కలెక్టర్ ఆదేశాల మేరకు బుచ్చి ఎమ్మార్వో సరుకును స్వాధీనం చేసుకోను మిల్లు వద్దకు వెళ్లి, అక్కడ ఏమీ లేకపోవడంతో వట్టి చేతులతో తిరిగి వచ్చారు. అయినా ఎందువల్లనో ఈ విషయాన్ని అన్ని శాఖల అధికారులూ మర్చిపోయారు. ఇటీవల ఆ రైసు మిల్లు యజమాని అసలు సరకును తన వద్ద దాచి పెట్టనే లేదని ప్లేటు ఫిరాయించినట్లు తెలిసింది. దీనితో అధికారులకు ఏమి చేయాలో పాలు పోవడం లేదు. సరుకు స్వాధీనం చేయకుండానే మిల్లు యజమాని వద్ద సురక్షితంగా వుందని విజిలెన్స్ శాఖాధికారులు ఎందుకు చెప్పినట్లు? విజయలక్ష్మి ట్రేడర్స్ వారు వేలం వేయవద్దని ఎందుకు హైకోర్టును ఆశ్రయించినట్లు? ఈ ప్రశ్నలకు జాయింట్ కలెక్టర్ స్వయం విచారణ జరిపితేనే సమాధానాలు దొరుకుతాయి.

జిల్లా వార్తలు

### జొన్నవాడ సత్రం తాళాలు తియ్యండి!

జొన్నవాడ పుణ్య క్షేత్రంలో మేనకూరు సత్రం పేరుతో దేవస్థానం ఇదివరలో ఒక సత్రాన్ని నిర్మించింది. ఈ సత్రంలో 12 రూములున్నాయి. కాని అక్కడ మంచాలు, ఫ్యానులు లేవన్న కారణంగా సత్రం తలుపులు తీయను అధికారులు నిరాకరిస్తున్నారు. యాత్రికులకు సరియైన వసతి లేక చెట్ల క్రింద, దేవస్థానంలో భద్రత లేకుండా వుండాల్సి వస్తున్నది. ఈ సత్రం గదులను బాడుగకిస్తే దేవస్థానానికి నెలకు 5 వేలకు పైగా ఆదాయం వస్తుంది. కొత్త పాలక వర్గం కోసం వేచి చూడకుండా కార్యనిర్వహణాధికారి సరియైన నిర్ణయం తీసుకొంటే భక్తులకు కాసింత వసతి దొరుకు తుంది.



# వరకట్న దుష్టహోమంలో మరో సరళ ఆహుతైంది!

వరకట్న దాహానికి మరో చెల్లి ఆహుతై పోయింది.

నెల్లూరు మూలాపేటకు చెందిన చైన్‌సింగ్ అనే ఉపాధ్యాయుని కుమార్తె సరళకు, తిరుపతి కోలా వీధికి చెందిన లోక్ సింగ్‌కు మూడేళ్ల క్రితం వివాహ మయ్యింది. లోక్ సింగ్ టి.టి.డి. ప్రెస్‌లో ఉద్యోగి. వీరికి 1 సం. వయస్సు గల బాబు కూడా వున్నాడు. పెళ్లయిన రెండవ నెల నుంచే తగినంత కట్నం, వస్తువులు తేలేదని భర్త, అత్త సూరిబాయి, ఆడపడుచు ఇందుమతి సరళను వేధించే వారు. ఈ విషయాలు తెలియ జేస్తూ పలుసార్లు ఇంటికి సరళ లేఖలు కూడా వ్రాసింది. తాము జోక్యం చేసుకొంటే కాపురంలో కలతలు వస్తాయని, సర్దుక పొమ్మని చైన్ సింగ్ ఆమెకు చెప్పేవాడు. దీన్ని అసరాగా తీసుకొని సరళ అత్తింటి వాళ్లు ఆమెను పలుసార్లు గాయ పర్చినా, మౌనం వహించడం తప్ప తిరగ బడేదే కాదు.

కాని ఈ మౌనమే ఆమె పాలిటి శాపమయ్యింది. భర్త, అత్తలు మరింత ముందుకు వెళ్లి జూన్ 10 తేది సరళను కిరోసిన్‌తో తడిపి నిప్పంటించారట. అన్ని వరకట్న చావుల మాదిరే 'స్టౌ' పేలిగిస్తూ చీరకు నిప్పంటు కొన్నట్లు ప్రచారం చేసారు. ప్రమాదం జరిగినప్పుడు భర్త, అత్తలు ఇంట్లోనే వున్నారు. ప్రమాదవశాత్తు అగ్ని ప్రమాదానికి గురై వుంటే కనీసం రక్షించే ప్రయత్నం ఎందుకు చేయలేదో అర్థం కావడం లేదు. ఇతరుల సహాయం కూడా ఎందుకు అర్థించ లేదో తెలియడం లేదు.

దాగా కాలిపోయాక హాస్పిటల్‌లో చేరి ప్రాణాలు కోల్పోయిన తరువాత సరళ మరణించిన విషయం తిరుపతి లోనే వున్న ఆమె సోదరునికి చెప్పడం పలు అనుమానాలను రేకెత్తిస్తున్నది. సరళ వాంగ్మూలం తీసుకొనేందుకు మేజిస్ట్రేట్‌ను పోలీసులు సకాలంలో పిలవక పోవడం పట్ల విమర్శలు వినవస్తున్నాయి. స్థానిక తెలుగు దేశం నాయకులు జోక్యం చేసుకోవడంతో పోలీసు విచారణ ధోరణి మారినట్లు వినికిడి.

ప్రమాదం జరిగినట్లు చెబుతున్న ఇంట్లో అసలు కిరోసిన్ 'స్టౌ' లేనట్లు టౌన్ డిఎస్పీ జరిపిన దర్యాప్తులో వెల్లడైందట. మహిళా శక్తి, పౌరహక్కుల సంఘాల ఆందోళనలు భరించ లేక సరళ అత్త సూరిబాయి, భర్త లోక్ సింగ్‌ను 15 తేది పోలీసులు అరెస్ట్ చేశారు. సరళను అంత మొందించి లోక్ సింగ్‌కి మరో పెళ్లి చేయాలన్నదే వీరి ఆలోచనని చైన్ సింగ్ ఆవేదన.

### నెల్లూరు ఆడపడుచును తిరుపతి వరుడు కాల్చుకు తినేశాడు!

## నెల్లూరు రాజకీయాలు
### విశ్లేషకుడు

### రమేష్ రెడ్డి నుంచి మరొక నోటీసు

మార్కెటింగ్ మంత్రి శ్రీ టి. రమేష్ రెడ్డి జమీన్ రైతుకు మరొక లీగల్ నోటీసు పంపారు. పరువు నష్టం దావా వేస్తానని మరొకసారి బెదిరించారు. తన మొదటి లీగల్ నోటీసుకు సమాధానం ఇవ్వక పోవడం, క్షమాపణ చెప్పక పోవడమే కాక, మళ్లీ తనపై చెడు వ్రాతలు వ్రాసినందు వల్ల తాను కోర్టుకు వెళ్లి, పరువు నష్టం దావా వేయడానికె నిర్ణయించు కున్నట్లు ప్రకటించా రాయన. మంచిదే – కోర్టు లిటిగేషన్ కావాలని మంత్రి గారికి అంత సరదాగా వుంటే మేమెందుకు కాదంటాం చెప్పండి?

తన ప్రతిష్టను కించ పరిచి, తన మంత్రిత్వం పూర్తి గొట్టడానికి జమీన్ రైతు ఒక పథకం ప్రకారం తనపై వార్తలు వ్రాస్తున్నదన్నది రమేష్ రెడ్డి లీగల్ నోటీసు సారాంశం. మా చేతిలో పెన్, కాగితం వున్నాయని మా ఇష్టం వచ్చినట్లు వ్రాసేస్తే ఎట్లా అని హెచ్చరించా రాయన. తన ఇంట్లో ఫర్నిచర్ కోసం తన శాఖ ఇంజనీర్లను బలవంత పెట్టి ఖర్చు పెట్టించా ననటం తప్పని; తన ఇంట్లో పాత ఫర్నిచర్ వుందని; కావాలంటే వచ్చి చూసుకోమని చెప్పారాయన. గత రెండు, మూడు వారాలుగా తనపై చేసిన ఆరోపణలన్నీ అవాస్తవాలని; వీటిని

కొరవ 7 పేజీలో



# రాపూరు ఎర్రచందనం స్మగ్లింగ్‌లో తెలుగు నేతల ప్రమేయం?

రాపూరు అడవుల నుంచి ఎర్ర చందనం స్మగ్లింగ్ అపరిమితంగా జరిగి పోతున్నది. లారీలకు లారీల ఎర్రచందనం దుంగలు నరుక్కొని వచ్చి ఫారెస్ట్ అధికారులు, పోలీసుల కళ్ల ఎదురుగానే నిర్భయంగా మద్రాసుకు చేరవేస్తున్నారు. గలప రవాణా జరిగినంత సులువుగా జరిగిపో తున్నది విలువైన వృక్ష సంపద. గత మూడు నెలల్లో రెండు కోట్లకు పైనే ఎర్రచందనం అడవి దాటి వుంటుందని అంచనా. మరొక నాలుగైదు కోట్ల విలువైన సరుకు రవాణాకు సిద్ధంగా వున్నదంటున్నారు. "వలస" అనే గ్రామ పరిసరాలలో ఈ సరుకు దాచి వున్నారని; అధికారుల క్లియరెన్స్ అందినప్పుడల్లా ఒకటొకటిగా లారీలను కదిలిస్తున్నారని చెప్తున్నారు.

ఈ మొత్తం దుర్మార్గ వ్యాపారానికి కొందరు తెలుగు నేతల అండ ఆశీర్వాదం వున్నాయని విశ్వసనీయ సమాచారం. స్థానికంగా పెద్ద పదవుల్లో వుండే వారేకాక, జిల్లా పెత్తనం చేసేవారూ వాటాలు పంచు కొంటున్నారని నమ్మకంగా తెలుస్తోంది. "వలస" గ్రామ పరిసరాలలో నిల్వ చేయడం; లారీలకు లారీలు తరలిపోతుంటే ఫారెస్ట్ అధికారులు కళ్లు మూసుకొని వుండడం ఈ తెలుగు నేతల ప్రమేయం ఫలితమేనని వేరుగా చెప్పనక్కరలేదు.

ఒక పోలీసు సబిన్స్పెక్టర్ మాత్రం ఈ దుర్మార్గాన్ని నిరోధించ డానికి ప్రయత్నిస్తున్నా డంటున్నారు. అందువల్ల అతడ్ని అక్కడి నుంచి బదిలీ చేయించ డానికి జరిగిన ప్రయత్నాలు విఫలం కావడంతో – మొన్నొక రోజు అతడ్ని రాపూరు అతిథి గృహానికి పిలిపించి తెలుగు పెద్దలు రాజీ ప్రతిపాదన చేశారు. కానీ అది విఫలమైంది. తమ చూస్తూ చూస్తూ అందుకు వప్పుకోలేనని తిరుక్కున్నాడట. దానితో అతడ్ని క్షణాల్లో బదిలీ చేశారు. బదిలీ తర్వాత ఐదారు లారీలు ఒకేసారి దాటాయి.

ఎర్ర చందనం విలువైన వృక్ష సంపద. ఒక్క రాపూరు, వెంకటగిరి అడవులలో తప్ప దేశంలో మరెక్కడా

**అధికార బలంతో అరుదైన వృక్షజాతిని అంతరింప జేస్తున్నారు!**

పెరగది చెట్టు. కోతకు వలిసే ఇది 60, 70 ఏళ్లకు కానీ పక్వానికి రాదు. ఈ చెక్కలను ఏమి చేస్తారు, ఎందుకు వాడతారన్నది చిదంబర రహస్యం. సంగీత వాద్య పరికరాలకు వినియోగించడం కోసమనే నెపంతో జపాన్ దేశస్థులు దీనికి విపరీతమైన ధర చెల్లించి కొనుగోలు చేస్తున్నారు. అది నిజమని ఫారెస్ట్ అధికారులకు కూడా నమ్మకం లేదు. అంతకు మించిన వుపయోగం ఏదో ఈ చెక్కల ద్వారా వారికి వుండాలని ఫారెస్ట్ అధికారుల అనుమానం. ఇది ఎగుమతికి నిషిద్ధ వస్తువు. కానీ అడవి దాటి మద్రాసు చేరితే – అక్కడ్నుంచి దేశం దాటించడం మంచినీళ్ల ప్రాయమట. అందువల్లనే అరుదైన ఈ వృక్ష జాతి వీరి బారిన పడి అంతరించి పోతున్నది.

రక్తచందనం స్మగ్లింగ్ ఈ జిల్లాకు కొత్త కాదు. వెంకటగిరి, రాపూరుల నుంచి అది ఎప్పుడూ జరిగే తంతే. కాని ఇదివరకు అడపా దడపా అంబాసిడర్ కారు డిక్కీలలో దాచిపెట్టి తరలించే వారు. ఇప్పుడు ఏకంగా లారీలనే వాడుతున్నారు. ఈ మార్పుకు కారణం తెలుగు నేతల ప్రోత్సాహమేనని భావించాలి. అధికారాన్ని రాత్రికి రాత్రి తమను సిరిసంపదలలో ముంచెత్తే ఆయుధంగా వాడుకోవడానికి మహా ఆరాట పడిపోతున్న తెలుగు నేతలు తమ డబ్బు కక్కుర్తికి ఈ జిల్లాకే గర్వకారణమైన వృక్ష జాతి అంతరించి పోతున్నదనే నిజాన్ని విస్మరిస్తున్నారు. ఈ దుర్మార్గాన్ని అరికట్ట వలసిన ఫారెస్ట్ అధికారులు బదిలీల భయంతో, వాటాల ప్రలోభంతో రాజకీయ ముష్కరులతో

కొరవ 7 పేజీలో

### జమీన్‌రైతు చందాదారులకు మనవి

జమీన్‌రైతు పత్రిక చందా అందరు చందా దారులకు 31.3.96 తేదితో అయిపోయింది ఆ విషయం కార్డు ద్వారా కూడా తెలిపియున్నాము. 1.4.96 నుండి జరుగు సంవత్సర చందా, మరియు పోయిన సంవత్సరం నిల్వ వున్న వారు దయచేసి వెంటనే చెల్లించి పత్రిక నిర్వాహణకు సహాయ పడవలసిందిగా ప్రార్థన.

-మేనేజరు

## సణుగుడు

4 పేజీ కొరవ

వదులుకున్నారు: వారు రాజకీయ వ్యవహారాలు వదులుకోనూ లేక, వాటిని పట్టుకొని వూగులాడే శక్తి లేక దైన్యస్థితి భావంతో పతనమౌతున్నారు. మొన్నటి ఒంగోలు ఎన్నికల్లో ప్రస్ఫుటంగా వ్యక్తమైంది ఈ లోపం! నెల్లూరు నుంచి ఒక్క కాంగ్రెస్ నాయకుడు కూడా అటు వైపు ముఖం చూపలేదు.

అప్పటికైనా వారిలో పరివర్తన కల్గి, సణుగుడు వదిలే వారిలో చాలా సమస్తమంటే జనార్దన రెడ్డి గారూ అభ్యంతర పెట్టరను కొంటాను. నాయకుల సంగతి ఎటుపోయినా కార్యకర్తలు మాత్రం వర్గాలు లేకుండా అందరూ ఒకే మాట మీద నిలబడితే చాలా సంతోషిస్తారు. ప్రతిపక్షంలో పార్టీ ఉనికి కాపాడు కోవాలంటే ఆ మాత్రం ఐక్యత తప్పని సరి. అయితే ఇంతకాలం శత్రుత్వంతో ఒకరిపై ఒకరు బుసకొట్టుకున్న మునిసిపల్ రాజకీయ వాదుల్లోనూ ఈ ఐక్యత వీలౌతుందా? ఛైర్మన్‌ను వైరిపక్షంగా భావించి, ఉదకాడించడానికి ఎగిరెగిరి పడిన మాగుంట కౌన్సిలర్లు కలిసి పనిచేయగలరా?

మాగుంట కలయిక స్వాగతించ దగిన పరిణామమే కాని, నెల్లూరు జిల్లా వరకు నికాయితీగా వుంటేనే అది నిలుస్తుంది. మేగోరె ఎందుకోసం ఈ కలయిక పాటిక విమర్శిస్తున్నా. దాని వుద్దేశ్యం ఏదైనా మంచి మనసుతో, కాంగ్రెస్ మేలు కోరి మాగుంట కుటుంబీకులను అందరితో కలిసిమెలిసి తిరగనిస్తే ప్రతి కాంగ్రెస్‌వాదీ సంతోషిస్తారు.

* * *

జమీన్‌రైతుపై సిపిఎం, తెలుగు దేశం పార్టీల మూకుమ్మడి దాడిని జిల్లాలోని కాంగ్రెస్ వాదులందరూ ముక్త కంఠంతో నిరసించారు. అందుకు వారికి పత్రిక తరఫున వందనాలు చెల్లించు కొంటున్నాను.

మాజీ ఎమ్మెల్యే శ్రీ సివి శేష రెడ్డి, మునిసిపల్ ఛైర్మన్ శ్రీ ఆనం వివేకానంద రెడ్డిల పూనిక ఇది. వారిద్దరి ప్రోద్బలంతో - మాజీ మంత్రులు శ్రీ పసల పెంచలయ్య, శ్రీ ఆనం రామనారాయణ రెడ్డి, మాజీ ఎమ్మెల్యే శ్రీ కెవి సుబ్బారెడ్డి, యువజన నాయకులు దేవకుమార్ రెడ్డి, సునీల్ కుమార్ రెడ్డి, శ్రీ పూటుకూరు ఆదిమూర్తి తదితరులంతా కలసి 16 తేది ఇందిరా భవన్‌లో సభ జరిపి, ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టి జమీన్ రైతుపై దాడులు సహించమని హెచ్చరించారు. ఆపత్సమయంలో పార్టీ అండగా నిలుస్తుందని భరోసా ఇచ్చారు. పత్రికా స్వాతంత్ర్య పరిరక్షణకు తమ నైతిక మద్దతు తెల్పిన వారందరికి మా వందనాలు.

జమీన్‌రైతు కాంగ్రెస్ పత్రిక కాదు; కాంగ్రెస్‌ను అభిమానించే పత్రిక. అప్పుడీ అవసర సమయంలో అండ ప్రకటించిన వారందరనీ జమీన్‌రైతు ఏదో ఒక సందర్భంలో విమర్శించింది; తెగనాడింది. కానీ వారు వాటిని విస్మరించి పత్రిక పట్ల తమ అభిమానం ప్రదర్శించారు. వారి ఔదార్యం నిజంగా అభినందనీయం.



## ఎర్రచందనం స్మగ్లింగ్

6 పేజీ కొరవ

చేతులు కలపడం, కళ్లు మూసుకొని బ్రతకడం మరీ నీచమైన నేరం.

పేర్లు వ్రాయడం పెద్ద పని కాదు; మరొక నష్ట పరిహారం కేసుకంటే ప్రమాదం ఏదీ మాకు ఎదురు కాదు; కానీ వారే విజ్ఞతతో ఆలోచించి తమ తప్పును సవరించు కొంటారనే వుద్దేశ్యంతో జనాంతికంగా తెలుగునేతలని సరిపెడ్తున్నాము. సవరించు కోకుంటే పారబట్టక తప్పనిస్థితి ఏర్పడుతుంది.

## నెల్లూరు ముచ్చట్లు

6వ పేజీ కొరవ

చదివి తనను అడిగే వారికి అవి అసత్యాలని చెప్పడం చాలా కష్టంగా వుందని; అందువల్ల తనకు క్షమాపణలు చెప్పాలని ఆ నోటీసులో కోరారు రమేష్ రెడ్డి.

మంత్రి గారు ఎటూ నష్టపరిహారం దావాకు కోర్టుకు వెళ్తానంటున్నారు కాబట్టి దీనికి సమాధానం, ఆరోపణలకు సంబంధించి మా దగ్గరున్న ఆధారాలు కోర్టులోనే విన్పించడం సమంజసం కదా? అందువల్ల మా వివరణ ఇవ్వడం లేదు.

### సోమశిలకు నీళ్లు

తుఫాన్ వచ్చి, సోమశిలను నీటితో వెళ్లింది. పెన్నా ఉపనదులైన కుందు, సగిలేరు, చెయ్యేరు, పాపాఘ్ని, చిత్రావతి వంటివన్నీ పొంగి ప్రవహించడంతో ఇప్పటికి (20 తేది) 21 టిఎంసిల నీరు సోమశిలకు చేరింది. ఇంకా సన్నగా ప్రవాహం వస్తూనే వుందట.

సోమశిలకు జూన్ నెలలో నీళ్లు రావడం చాలా అరుదైన విషయం. అందువల్ల ఆలస్యంగా నైనప్పటికీ రెండవ కారుకు నీరివ్వడం వీలౌతున్నది. సోమశిలలో 45 టిఎంసిల నీరు నిల్వ చేయవచ్చు. కానీ మునక గొడవల్లో 30 నుంచి 35 టిఎంసిలు దాట లేకున్నారు. భూసేకరణ పూర్తి అయి వుంటే, రేపు వర్షాకాలంలో వచ్చే నీటితో సోమశిల పూర్తి స్థాయి నీటిమట్టం చూచి వుండేవారం. నీరు వృథాగా వుంచడ మెందుకని కండ్లేరుకు వదులు తున్నారు. అక్కడ 3.5 టిఎంసిల నీరు చేరింది. అయితే తెలుగు గంగ కాలువ ఈ స్వల్ప నీటి ప్రవాహాన్నే తట్టుకోలేక పోతున్నది. చాలా చోట్ల కాలువ నుంచి నీరు లీకై పల్లపు ప్రాంతాలలో మడుగులు కడ్తున్నది. మహా ఘనత వహించిన ఇంజనీర్ల నిర్వాకం ఇది. ఇందుకు బాధ్యులైన ఇంజనీర్లను, కాంట్రాక్టర్లను వెనక్కు పిలిపించి, కటకటాల వెనక్కు నెట్టి చట్టమేది లేదా?

## తిరుపతి ఎమ్పీ తొలి కార్యక్రమం

తిరుపతి పార్లమెంటు సభ్యుడు శ్రీ ఎన్. సుబ్రహ్మణ్యం నెల్లూరు జిల్లాకు తొలి సహాయం చేసి పెట్టారు. మద్రాసు నుంచి సూళ్లూరుపేట వరకు నడుస్తున్న లోకల్ ట్రైన్‌ను నెల్లూరు వరకు పొడిగింప జేశారాయన. రైల్వే అధికారులు అందుకు అంగీకరించారట. ధార్మివార్ ఎక్స్‌ప్రెస్‌ను నాయుడుపేటలో నిలపడానికి అధికారులను ఒప్పించారు శ్రీ సుబ్రహ్మణ్యం. ఈ ఉత్సాహం ఐదేళ్లు నిలుపుకో గల్గితే సుబ్రహ్మణ్యం పదవికి సార్థకత చేకూరుతుంది.

### విఆర్ కాలేజి

విఆర్ కాలేజి సెలవుల అనంతరం జూలై 1 తేది పునః ప్రారంభమౌతుంది. జూనియర్ ఇంటర్, డిగ్రీలలో చేరదల్చిన వారు జూన్ 26, జూన్ 29 తేదుల లోపల దరఖాస్తులు దాఖలు చేయాలని ప్రిన్సిపల్ డాక్టర్ గోపాల కృష్ణమూర్తి కోరుతున్నారు.

### విఆర్ హైస్కూలు

విఆర్ హైస్కూలులో చదివే పిల్లలకు అటెండెన్స్ సక్రమంగా లేకుంటే పరీక్షలకు పంపడం జరగదని హెడ్మాష్టర్ శ్రీ నరసింహారెడ్డి తెలియజేస్తున్నారు. ఈ ఏడాది హాజరు తగ్గిన పిల్లల్లో 17మందికి టి.సి.లు ఇచ్చి పంపేశారట. స్కూలు నిర్వహణలో క్రమశిక్షణ పాదుకొల్ప డానికి ఈ చర్యలు తీసుకుంటున్నారు.

### బ్యాంకు ఆఫీసర్ రిటైర్మెంట్

నెల్లూరు స్టేట్ బ్యాంక్ కోఆర్డినేటర్ శ్రీ పసుమర్తి శివరామయ్య రిటైరైనారు. క్యాషియర్‌గా చేరి, కోవూరు, ముత్తుకూరు వంటి బ్రాంచిలలో మేనేజర్‌గా పనిచేసి, కోఆర్డినేటర్‌గా రిటైరైనా రాయన.

### మరణం

కస్తూరిదేవి విద్యాలయం రిటైర్డ్ హెడ్మిస్ట్రెస్, మంచి ఉపాధ్యాయిని శ్రీమతి పి. సావిత్రీ దేవి తల్లి అకుల ధనలక్ష్మమ్మ 11 తేది మరణించారు.

### నెల్లూరు ఎమ్పీ

నెల్లూరు పార్లమెంటు సభ్యురాలు శ్రీమతి పనబాక లక్ష్మి 18 తేది నెల్లూరు వచ్చారు. తుఫాన్ దెబ్బతిన్న ప్రాంతాలలో తిరుగుతున్నారు.

## కావలి

5 పేజీ కొరవ

వారాలు రిమాండులో వున్న సద్గుణ రావు వాయిదా కోసమని గత వారంలో కావలికి వచ్చి క్లాసులో పాఠం చెప్తున్న రాఘవ రెడ్డిపై దాడి చేసి గొడ్డలితో నరికి చంప బోయారు. అదృష్టవశాత్తు దెబ్బ

### ఎన్‌టిఆర్ హైస్కూల్ విద్యార్థి ప్రతిభ

విద్యానగర్ ఎన్‌టిఆర్ మోడల్ హైస్కూల్ విద్యార్థి ఆకం గీతానాథ్ 7వ తరగతి కామన్ పరీక్షల్లో జిల్లాలో



ప్రథమునిగా నిలిచారు. ఆ విద్యార్థి 500 మార్కులకు గాను 454 మార్కులు పొందినట్లు హైస్కూల్ హెడ్మాస్టర్ మూర్తి తెలియజేశారు.

# కమ్యూనిస్టు పార్టీని హ్రస్వ దృష్టితో చూడవద్దు!

మర్రి విశేశ్వర్యము వాయకులలో ఒకరైన శ్రీ ఉన్నం జనవయ్యపై మర్రి స్మగ్లింగ్ ఆరోపణలకు సంబంధించి గత వాల్గోరు వారాలుగా జమీన్ రైతులో వస్తున్న వార్తలు, వ్యాఖ్యలు హేతుబద్ధంగా లేవు. అవి వివాదాన్ని ప్రేరేపించేవిగా వున్నాయి. వాస్తవ దృక్పథంతో, విశ్లేషణాత్మక వైఖరితో వార్తలు వ్రాస్తే బాగుండేది. కాని, నెల్లూరు జిల్లాకు, ఒక వ్యక్తికి, ఇంకా నిరూపణ కాని నిందారోపణలకు సంబంధించిన విషయాన్ని మొత్తం కమ్యూనిస్టు పార్టీ తలకు చుట్టడం భావ్యం కాదు. కమ్యూనిస్టు పార్టీ అంటే ఒక ఎల్లయ్యకో, పుల్లయ్యకో పరిమితమైన పార్టీ కాదు. అసంఖ్యాక అమర వీరులు తమ ప్రాణాలు ఆహుతి చేసి నిర్మించుకున్న సంస్థ ఇది. జాతీయ స్థాయిలో ప్రజా చైతన్యానికి ప్రతీక అయిన ఈ మహా ఉద్యమం పట్ల మీకు సదవగాహన వున్నట్లు లేదు. అది వుండి వుంటే అటువంటి నిందాపూర్వక వ్యాఖ్యలు చేయరు. తెలుగు దేశంతో సిపిఎం పొత్తు పదవీ వ్యామోహంతో కుదుర్చుకున్నది కాదు. జాతీయ స్థాయి రాజకీయ పరిణామాలు, చారిత్రక అవసరాల దృష్ట్యా కుదుర్చుకొన్న ఒప్పందం అది. ఆ చారిత్రక వాస్తవం గ్రహించ లేక పోవడం మీ అజ్ఞానమే తప్ప సిపిఎం పొరపాటు కాదు.

అన్ని పార్టీలలో వలె, సిపిఎం లోనూ అవినీతి పరులు వుంటే ఏరుదగట్టుంది. సిపిఎంలో అవినీతి పరులు లేరని నేనడరం లేదు. విమర్శ వారికే పరిమితం కావాలి తప్ప, మొత్తం పార్టీకి చుట్టడం తప్పు. నెల్లూరు జిల్లాలోని రాజకీయ వాదులలో నిజాయితీ, పార్టీ పట్ల నిబద్ధతల విషయంలో జక్కా వెంకయ్య గారికి ప్రధమ స్థానం వుంటుంది. ఆయన్ను విమర్శించడం అన్యాయం.

నెల్లూరు ... షిషబ్బీర్ ఖాన్

## పంచాంగం

జూన్ తిథులు

ఆషాఢ శుద్ధ

తే 22 శని షష్టి సా.గ. 4.25 వ

తే 23 ఆది సప్తమి సా.గ. 5.33 వ

తే 24 సోమ అష్టమి సా.గ. 6.11 వ

తే 25 మంగళ నవమి సా.గ. 6.22 వ

తే 26 బుధ దశమి సా.గ. 6.01 వ

తే 27 గురు ఏకాదశి సా.గ. 5.10 వ

తే 28 శుక్ర ద్వాదశి సా.గ. 3.54 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ..

## కోట్ల

1వ పేజీ తరువ

నాలుగున్నర దశాబ్దాలుగా ముఠాలు కట్టి, గ్రూపులు నడిపి ఆ తత్వం జీర్ణించుకు పోయిన విజయ భాస్కర రెడ్డి గారు ముఖ్య మంత్రి కుర్చీలో కూర్చొని పద్ధతులు మార్చుకోలేక పోయారు. తనకెప్పుడైనా ఎవరైనా చిన్న అపకారం చేసి నా...దినా దాన్ని గుర్తు పెట్టుకొని, సందు దొరికినప్పుడు చావగొట్టడం ఆయన రాజకీయ శైలి. ఎవ్వరితోనూ రాజీ పడరు; ఎవ్వరితోనూ సఖ్యతగా మెలగలేరు. అందువల్ల ఆయన ముఖ్యమంత్రిగా వున్న రెండుసార్లు ఎన్నికలలో పార్టీ శంకర గిరి మాన్యాలు పట్టి పోయింది.

వెంకటస్వామి కూడా ఇదే అన్నారు. ప్రతి కార్యకర్త అభిప్రాయం కూడా అదే! ఆ ఐరన్ లెగను ఢిల్లీలో పెద్దరికం పీఠంపై పాదం పెట్టనిస్తే కాంగ్రెస్ చరిత్ర పుస్తకానికి తుది పలుకులు వ్రాసేయ వచ్చునని మరొక రాష్ట్ర నాయకుడు వ్యాఖ్యానించాడు. ఆ ఒక్క ఎన్నికతో మూట సర్దే పార్టీ జీవనం ముగిసి పోతుంద...; శాశ్వతంగా రాజకీయ సమాధి అవుతుందని దీని అర్థం.

అయినా కోట్ల వారికంత దురాశ ఎందుకు కలిగినట్లు? పివి కంటే ఆ రెండులో తీసి పోయానని ఆయన భావిస్తున్న ట్లున్నారు తప్ప ఆ పదవికి తన అర్హత లేమిటన్న ఆలోచన చేసినట్లు లేదు.

## తంత్రం పలించేనా

1 వ పేజీ తరువ

కార్లు, సిబ్బంది, అతిథి గృహాలు, విమాన యానాలు, విదేశీ ప్రయాణాల వంటి ఆడంబరాలు అధికంగా వుంటాయి.

చంద్ర బాబు మాత్రం ప్రాజెక్టులని కలవరి స్తున్నాడు. ఇది తప్పించుక తిరిగేందుకు చెప్పే మాటే తప్ప – ప్రాజెక్టులకు, పదవులకు సంబంధం లేదని; ఎన్ని ఎక్కువ పదవులు తెచ్చుకో గల్గితే ఆయా విభాగాలలోని ప్రాజెక్టులను అన్ని ఎక్కువగా రాష్ట్రానికి తరలించుకు రావచ్చు నని తెలుగు నాయకులు భావిస్తున్నారు.

## పంచవటి ఆశ్రమం 24వ వార్షికోత్సవం గీతా యజ్ఞ ఆహ్వానం

21-6-96 నుండి 23-6-96 వరకు
నెల్లూరు, జాకీర్‌హుస్సేన్ నగర్,
పంచవటి ఆశ్రమంలో శ్రీ బాలయోగి స్వాముల వారి
పర్యవేక్షణలో గీతా యజ్ఞం జరుగును.
ప్రతి రోజూ ఉ 6.గం నుంచి 9.గం వరకు, యజ్ఞం
ఉ 10.గం నుంచి 1గం వరకు సా 4.గం నుంచి 6.గం వరకు
ఉపన్యాసములు
సభాధ్యక్షులు: శ్రీశ్రీశ్రీ పరమానంద స్వాముల వారు
ఉపన్యాసకులు: సోమశిల పరమానంద స్వాములు గారు
పెదవడ్లపూడి నాగెళ్ళ మానుమాయమ్మ గారు,
ఎలమండ్యం కాశేశ్వరానంద స్వాముల వారు,
నిత్యప్రకాశానంద స్వాముల వారు,
శుకదేవానంద స్వాముల వారు,
పెదకొండూరు రామానంద యోగి స్వాముల వారు,
ఇనమడుగు కృష్ణానందగిరి స్వాముల వారు,
వల్లివేడు వీరబ్రహ్మానంద స్వాముల వారు,
డాక్టర్ పద్మనాభయ్య గారు.
ఆస్తికులెల్లరూ విచ్చేసి గీతా జ్ఞాన బోధను
పొందవలసిందిగా కోరుతున్నాము.
పంచవటి ఆశ్రమ కమిటీ
భక్తబృందం

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ తరువ

### నెల్లూరు ముచ్చట్లు

భక్తవత్సలం గారొచ్చినపుడు కనుపూరు కాల్వ సభలో మంత్రి మెడలో దండల ద్వారా అలంకరించిన 70 దారల ఖద్దరు నూలు సుమారు ధనం రు100 లు క్రయంపోసేది జిల్లా కాంగ్రెస్ కమిటీకి చెందవలసి యుండగా, నిరంకుశపు అసిస్టెంటు మంత్రి రాఘవయ్యగారు అపహరించడం ఏమంత సబబుగా లేదు. యూనాటైనా కాంగ్రెసు కొప్పుతిప్పాడా, లేదా కనుక్కోండి.

***

హోటళ్ళలో కాయగూరల భోజనం 0-8-0; మాంసాహారులకు 0-10-0, వెల భోజనం కాయగూరల ... 20లు, మాంసాహారులకు 22 1/2రు లుగా నిర్ణయించారు. ఎక్కువ ఖర్చులు భరించవలసిన రైల్వే హోటల్ వాళ్ళు 0-6-6కు భోజనం పెడ్తుంటే వీళ్ళు ఎనిమిదణాలు చేయడం చాలా అక్రమం.

***

జిల్లాబోర్డు ప్రెసిడెంటుగారూ! లక్షరూపాయల దాత నన్నపురెడ్డి శేషురెడ్డిగారి ఆయుర్వేద ఆస్పత్రి ఏమైంది? ప్రజారాజ్యాల్లో అంత అలసత్వం వహించే జిల్లా బోర్డు ప్రెసిడెంటు యింకా అమల్లో వుండడం దేశ దౌర్భాగ్యంగా వుంటుంది.

***

## మాటలతో ఆట - 9

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | | 3 | 4 | | 5 | | 6 | 7 | |
| 8 | | | 9 | | | | | | 10 | | 11 |
| | | 12 | | | | | 13 | | | 14 | |
| | 15 | | | | | 16 | | | 17 | | |
| 18 | | | | 19 | | | | 20 | | 21 | |
| | | | 22 | | | 23 | | 24 | | | |
| | | 25 | | | 26 | | | | | | 27 |
| | 28 | | | | 29 | | | 30 | | 31 | |
| 32 | | | 33 | 34 | | | 35 | | | | |
| | | 36 | | | | | 37 | | | 38 | 39 |
| 40 | 41 | | | 42 | 43 | | | 44 | 45 | | |
| | 46 | | | | 47 | | | | 48 | | |

### అడ్డం

1. సమయం (3)
3. నమస్కారం (2)
5. ఏనుగు (4)
8. వైరం (2)
9. ఆకాశంలో చరించేవారు (3)
10. చందనం (3)
12. వృక్షము (4)
13. కొంత - అటునుంచి (2)
14. మురికి కొననరకండి గర్వం మిగులుతుంది (2)
15. గారిద (3)
16. పూరిల్లు (2)
18. పాము ఏనుగైంది(3)
19. యుద్ధం (2)
20. అందం (4)
22. ప్రేమ (2)
24. శబ్దం (3)
25. స్నేహితురాలు (2)
26. సహాయం (3)
28. స్త్రీ (2)
29. నేల (2)
31. కీర్తి (2)
32. జారు (2)
33. స్త్రీల ఒయ్యారాలు (3)
35. బంగారం (3)
36. రాజ ప్రాసాదం (3)
37. పెలాష్టికారు; అటునుంచి పండితుడు (2)
38. స్త్రీ (2)
40. ఏనుగు (2)
42. నెత్తురు చెల్లాచెదరైంది (3)
44. లాభం (2)
46. శ్రీకృష్ణుని పట్టమహిషి (3)
47. తామర పువ్వు (3)
48. స్త్రీ (2)

### నిలువు

1. పార్వతి (3)
2. రగాకారు చప్పిక (2)
3. వచనం కొన తెగింది. కింద నుంచి పంట(3)
4. స్థిరము - విస్మృతి (3)
5. చేయిచూపి మన భోగభాగ్యాలను చెప్పేశాస్త్రం (5)
6. ప్రపంచం (2)
7. సంతోషం (3)
9. దుఃఖం (3)
11. ముద్దు-ముచ్చట లాగే మరొకటి (4)
12. ఆవలి ఒడ్డు (3)
15. పక్షి (3)
17. తుంబురులు (4)
18. త్రిలోక సంచారి (3)
19. రచ్చ (2)
20. బందిఖాన (2)
21. వామ్ముకారు వృథా అనే అర్థంలో - మ వత్తు లేదు (2)
22. రక్షాబంధనం (2)
23. అంద (3)
25. భార్య (2)
26. కష్టాలు (3)
27. భయం (2)
28. నశించెది (2)
30. ధర్మ వ్రతం (4)
32. పాద రసం (3)
33. చింత (2)
34. పక్షిరెక్క (3)
35. కమ్మరివారి కొలిమిలో ఉండే తోలుతిత్తి (2)
39. స్త్రీ (3)
41. శ్రీ - కి తమిళంలో సమానార్థకం - తిరుపతిలో దొరకవచ్చు (2)
43. వారు ఎందుకో తిరగబడ్డారు (2)
45. కింద నుంచి సముద్రం (2)

### మాటలతో ఆట - 7 సమాధానాలు

అడ్డం:– 1. తలారి. 3. అపద. 5. మేను. 7. వినా. 9. వాత. 10. విల. 11. జీవిత 13. వారి. 14. సరోజ. 15. మావి. 16. సమాధి. 17. అన. 18. యాతన. 20. నివాసం. 22. రాముడు. 24. పాయసం. 26. నావ. 27. కాయ. 28. గారిద. 30. సాగరం. 31. వాలి. 32. సరం. 33. యమునన. 36. వెలమ. 38. వా. 39. లైమ. 41. షష్టి. 42. పావము. 43. గోపురం. 45. దాహర్తి. 46. కవి. 47. గురించి. 49. రవాలం. 50. శారికలు. 51. గుణ. నిలువు:- 1. తపిర. 2. లావా. 4. పటం. 5. మేత. 6. అలజ. 8. రావి. 10. విరోధి. 11. జీవి. 12. తహతహ. 13. వాకం. 14. సమాసం. 15. మానము. 16. సవాలు. 17. ఆరామం. 19. సమగారం. 21. జావరం. 23. యుగాలిచె. 25. ముడి. 26. నాగవల్లి. 29. రయు. 30. సాన. 32. సమవర్తి. 34. మునుషు. 35. మేషము. 37. లపోవాలం. 40. మరిచిక. 43. గోపిక. 44. రంగు. 45. దావా. 46. కరి. 48. రింగు

విజేత:- యం.టి. ప్రసాద్. 10-32 (7), వి.ఎస్ స్ట్రీట్, రేణిగుంట - 517520;

# నగ్న నటన వల్ల సీమా బిస్వాస్‌కు విడాకులొచ్చాయి!

"బందిపోటు రాణి" పూలన్ దేవి జీవిత కథ ఆధారంగా తయారైన "బాండిట్ క్వీన్" చిత్రంలో నటించి ప్రశంస లందుకున్న సీమా బిశ్వాస్ అవస్థలు కొని తెచ్చుకున్నదిప్పుడు. నిషేధించబడిన ఈ చిత్రం ఇటీవల కోర్టు తీర్పు ద్వారా మళ్లీ విడుదలైంది. అదే సీమా బిశ్వాస్‌కు ముప్పు తెచ్చి పెట్టింది. ఆ చిత్రంలో ఒక సీన్‌లో నగ్నంగా కనిపిస్తుందామె. అలా నటిస్తున్నట్లు తనతో ముందుగా చెప్పలేదని, అట్లా నటించి తనకు మిత్రవర్గంలో, బంధు వర్గంలో తలవొంపులు తెచ్చి పెట్టిందని, కానిక ఆమెతో వైవాహిక జీవితం కొనసాగించ లేనని ఆమె భర్త కేసు పెట్టి, ఇటీవల విడాకులు పొందాడు.

### చిలక్కొట్టుడు

ఇవివి సత్య నారాయణ దర్శకత్వం వహించే చిలక్కొట్టుడు చిత్రంలో జగపతి బాబు సరసన రమ్యకృష్ణ, గౌతమి, మధుబాల, ఇంద్రజ నాయికలు.

### శుభాకాంక్షలు

"పూవే ఉనక్కాగ" తమిళ చిత్రాన్ని శ్రీ సాయిదేవా ప్రొడక్షన్స్ వారు తెలుగులో నిర్మిస్తున్నారు. దాసరి నారాయణ రావు, సత్యనారాయణ, జగపతి బాబు, ఆమని, ఇంద్రజ, కోట శ్రీనివాస రావు, బ్రహ్మానందం, సుధాకర్, బాబూ మోహన్, ఎవిఎస్, పావుకారు జానకి, వై. విజయ, పాత్రధారులు. మాటలు మరుధూరి రాజా. సంగీతం కోటి, దర్శకత్వం భీమనేని శ్రీనివాసరావు.

### రాశి మూవీస్ చిత్రం

జూన్ 20న ప్రారంభమైన షూటింగ్ అక్టోబర్‌లో ముగిసే రాశి మూవీస్ చిత్రంలో ఒక రెసిడెన్షియల్ ఉమెన్స్ కాలేజీని శ్రీవిద్య నడుపుతూంటుంది. ఆ కాలేజ్ నిర్వహణ బాధ్యతలు వెంకటేష్ వహిస్తుంటాడు. బాల్యంలోనే భర్తను పోగొట్టుకున్న అభాగినిగా రవళి; అల్లరి పిల్లగా రమ్యకృష్ణ కూడా ఆ కాలేజీలో విద్యార్థినులు. వీళ్లు గాక సత్యనారాయణ, కోట శ్రీనివాస రావు, సాక్షి రంగా రావు, వేలు, ఎవిఎస్, సత్యప్రకాష్, జిత్ మోహన్ మిత్రా, కృష్ణ చైతన్య, జయలలిత, శివపార్వతి, మీనా కుమారి పాత్రధారులు. మాటలు సత్యానంద్. సంగీతం ఇళయరాజా, దర్శకత్వం కె. విశ్వనాథ్.

### భారతీయుడు చిత్రంలో

"భారతీయుడు" చిత్రంలో కమలహాసన్‌కు ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం కంఠం అరువు ఇస్తే, ఊర్మిళకు భానుప్రియ, మనీషాకు రోహిణి నేపథ్యంలో మాట్లాడారు. ఈ చిత్రం తమిళంలో కన్నా తెలుగులో విపరీతమైన కలెక్షన్‌లతో ఆడుతోంది.

జాబిలమ్మ పెళ్లి చిత్రంలో ఊహ, గిరిబాబు, తనికెళ్ల భరణి

# రాజకీయాలు వద్దు దేముడో – విజయశాంతికి అమితాబ్ మొర!

"ఐదేళ్ల తర్వాత ముఖానికి రంగు పూసుకున్నా – నన్ను తొలుదొల్త హీరోగా పరిచయం చేసిన రామనాథన్‌జీ చిత్రంలోనే మళ్లీ నటిస్తున్నందుకు ఎంతో ఆనందంగా వుంది. ఆయనకు మద్రాసులోనే సినిమా తీయడం సెంటిమెంట్," అంటూ అమితాబ్ కోకో కోలా బాటిల్ మూత తీసి, ప్రారంభోత్సవానికి క్లాప్ కొట్టిన రజనీకాంత్‌కు ఇచ్చారు; రజనీని ఉద్దేశించి మాట్లాడుతూ – "ఈయన షూటింగ్స్ లేనప్పుడు షేవ్ చేసుకోరు. గడ్డం పెంచేస్తారు. ఒక్కోసారి తలనీలాలు ఏ దేవుడికో అర్పించి, గుండుతో కనిపిస్తారు. మేట్ గురించి ఏ మాత్రం భయపడని గ్రేట్ ఆర్టిస్ట్," అన్నారు.

"ఈయన్ని అభినందించారా?" అంది విజయశాంతి.

"దేనికి?"

"తమిళనాడులో కొత్త ప్రభుత్వం రాజ్య మేలడానికి ఆయనే కారకుడు".

"నో పాలిటిక్స్ ప్లీజ్. రాజకీయాలను నేను వదిలేశాను. ఒకప్పుడు రాజకీయాల్లో చురుకైన పాత్ర వహించాను. ఇక చాలు భగవాన్ – అంటూ తిలోదకాలిచ్చేశాను. ఇప్పుడా చురుకుదనం సినిమా రంగంలో చూపిస్తున్నాను".

"ఒకవేళ సినిమా రంగం నుంచి రిటైర్ అయితేనో..."

"ఇప్పుడే కదా ఇంటర్వెల్ ముగిసి, రెండో భాగం మొదలైంది. అప్పుడే క్లయిమాక్స్ వరకు వెళ్లి పోయారే మీరు? ఎబిసిఎల్ కంపెనీ పనుల్లో బాగా బిజీగా ఉన్నాను. నాన్నగారి కవితలు కొన్ని సేకరించాలి. వాటిని పుస్తక రూపంలోకి తీసుకు రావాలి. ఇంటి వ్యవహారాలు సరేసరి. చాలా కమిట్‌మెంట్లు ఉన్నాయి. ఏటా ఐదు సినిమాలలో నటించాలనుకుంటున్నా."

"హిందీలో నాకు ఇది అయిదవ చిత్రం," అంది విజయ శాంతి.

"అలాగా!" అంటూ అమితాబ్, రజనీ కాంత్ వంక తిరిగి, "ఈమె కూడా గ్రేట్ ఆర్టిస్ట్. ఈమె కర్తవ్యం చిత్రానికి నేషనల్ అవార్డ్ తీసుకున్నప్పుడే నేను 'అగ్నిపుత్ర' చిత్రానికి నేషనల్ అవార్డ్ తీసుకున్నాను.

కొరవ 11 పేజీలో

## మహిళలకు ఓర్పు పేరిట పిరికితనం నూరిపోసిన

# సహనం

**చిత్ర సమీక్ష**

**గ్రిద్దలూరు గోపాలరావు**

"సహనం" ఒక సుగుణం. అది అతిగా కాకుండా ఒక పరిమితిలో వుండటం ఎంతో అవసరం. మోతాదు మించితే ముఖ్యంగా ఆడవారిలో అది ప్రమాదహేతువవుతుంది. ఆడవాళ్ల ఆటుపోట్లకు, వేదనలకు, సాధింపులకు తట్టుకొంటూ, సహనం అతిగా పాటించి తల ఒగ్గుతూ వుంటే, ఆ సమాజం వారి నెత్తినెక్కి ఇంకా జోరుగా స్వారీ చేస్తుంది. ఆడవారి జీవితానికి నరకాన్ని ప్రాప్తింప జేస్తుంది. అందువల్ల అనవసరమైన చోట సహనాన్ని ప్రక్కన బెట్టి తిరుగుబాటు చేస్తేనే దుష్ట సమాజం తోక ముడుస్తుంది. ముఖ్యంగా ఆడవారు ఈ నగ్న సత్యాన్ని గుర్తుంచుకొని అభ్యుదయవాదుల్లా అక్రమాలను అణగదొక్కి తమ శక్తి సామర్థ్యాలను స్త్రీ జాతి ప్రగతి కోసం పణంగా పెట్టాలి. ఈ అంశం మీద పి.ఎస్.రామచందర్ దర్శకత్వంలో "సహనం" చిత్రం రూపొందించ బడింది.

దివాకర్‌బాబు వ్రాసిన కథ కురచగాను, పలచగాను వుంది. కథ వివరణకు, విస్తరణకు చిత్రంలో పూర్తి స్థానం కల్పించ లేకపోయాడు దర్శకుడు. కథను చిత్రం రెండవ భాగానికే పరిమితం చేశారు. మొదటి భాగమంతా చిల్లర మల్లర విషయాలతో, కథకు సంబంధం లేని బ్రహ్మానందం, ఎ.వి.ఎస్., శ్రీలక్ష్మి హాస్య సన్నివేశాలతో నింపారు. వారి హాస్యమూ అంతంత మాత్రంగానే వుంది. దర్శకత్వానికి ఫర్వాలేదు అన్న రేటింగు ఇవ్వవచ్చు.

చిత్రం రెండవ భాగంలో గుప్పించిన కథకు శాంతి (ఊహ) అనే మధ్య తరగతి కుటుంబీకురాలిని సూత్రధారిణిగా చేస్తారు. శాంతి ఒక కంపెనీలో పని చేస్తు వుంటుంది. తాగుబోతు తండ్రి (తనికెళ్ళ భరణి), వంటింటికి అంకితమైన తల్లి, చదువుకుంటున్న తమ్ముడు, చెల్లి అంతా ఆమె సంపాదన మీద ఆధారపడి వుంటారు. శాంతి పెళ్ళి చేసుకొని అత్త గారింటికి వెళ్ళిపోతే ఆ కుటుంబాన్ని ఆదుకొనే వారు లేరన్న పరిస్థితుల్లో చిత్రం ప్రారంభమవుతుంది. ఆడ పిల్లకు పెళ్ళి తప్పని సరికాబట్టి, తనను వెంటాడుతూ చెంప దెబ్బతిన్న ఆనంద్ (ఆనంద్)నే ఇష్టపడి పెళ్ళాడుతుంది శాంతి. ఆమె పని చేస్తున్న కంపెనీకి కొత్తగా జనరల్ మేనేజర్‌గా రావు (ప్రకాష్‌రాజ్) వస్తాడు. అతను శాంతిని లోబరుచుకునేందుకు పథకాలు వేస్తుంటాడు. కొత్త మేనేజరు ప్రవర్తన ఆనంద్‌కు చెపుతుంది శాంతి. ప్రతిచోట అలాంటి రాక్షసులున్నారు కాబట్టి సర్దుకొని తప్పించుకు తిరుగుతూ వుండమని సలహా యిస్తాడు భర్త. రావు ఆనంద్‌ను లోబరుచుకొని ఒక రాత్రి ఆనంద్ ఇంట్లోనే మందు సేవిస్తాడు. మందు మత్తులో ఆనంద్ నిద్రపోగా, రావు శాంతిని బలాత్కరిస్తాడు. శాంతి తప్పించుకొంటుంది. శాంతి లొంగనందుకు ప్రతీకారంగా రావు ఆమె మీద లక్ష రూపాయల దొంగతనం మోపుతాడు. కోర్టుకెక్కుతుంది శాంతి. రావు సాక్ష్యాలను తనకు అనుకూలంగా మలుచు కుంటాడు. తనను పెళ్ళి చేసుకోమని శాంతి, రావును నిర్బంధించిందని; రావు నిర్దోషని కోర్టు తీర్పు యిస్తుంది.

కొరవ 11 పేజీలో

# రాజేంద్రప్రసాద్‌ను తీసి ఆలీనిఎందుకు పెట్టారు?

రాజేంద్ర ప్రసాద్‌తో ప్రారంభించిన సెంట్రల్ ఆర్ట్ మూవీస్ చిత్రాన్ని ఆలీతో ఎందుకు తీయవలసి వచ్చిందో వివరణ ఇవ్వలేక పోయారు నిర్మాతలు. ఇందులో ఆలీ జర్నలిస్టు. సత్యనారాయణ సైంటిస్టు. శుభశ్రీ, శ్రీకాంత్, బ్రహ్మానందం, ఎవిఎస్, చలపతి రావు, మల్లికార్జున రావు, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, గుండు హనుమంత రావు, సుబ్బరాయ శర్మ, అన్నపూర్ణ, వై. విజయ పాత్రధారులు. కథ సూర్యదేవర రామమోహన్ రావు, మాటలు మరుధూరి రాజా. సంగీతం కోటి, దర్శకత్వం సోమరాజు.

### తాతా – మనుమడు

తన సంస్థ సదా బిజీగా ఉండాలని, తన వద్ద పనిచేసేవారు హమేషా చురుకుగా ఉండాలని కోరుకునే నిర్మాత డి. రామానాయుడు. ఈయన కొత్త చిత్రం "తాతా– మనుమడు"లో కృష్ణంరాజు, శారద, వినోద్ కుమార్, సంఘవి, రంజిత, రమాప్రభ, లతాశ్రీ, కోట శ్రీనివాస రావు, గిరిబాబు, బ్రహ్మానందం, ఎవిఎస్, గుండు హనుమంత రావు, రాళ్ళపల్లి, శివాజీ రాజా పాత్రధారులు. కథ, మాటలు పరుచూరి సోదరులు, సంగీతం మాధవపెద్ది సురేష్, దర్శకత్వం సదాశివరావు. సురేష్ ప్రొడక్షన్స్ బ్యానర్‌లో "తోడి కోడళ్ళు" చిత్రాన్ని డి. రామానాయుడు హిందీలో నిర్మించ బోతున్నారు. సంజయ్ కపూర్, రాజ్‌బబ్బర్, రవీనాటాండన్, టాబు వగైరా తారాగణం. సంగీతం ఆనంద్ – మిలింద్, దర్శకత్వం కె. మురళీమోహన రావు.

# రాయి – తురాయి

## * నేటి నేతలకు ఎండ్రకాయల్లాగా పాకడం తప్ప, నిలబడడం చేత కాదు !

రాజకీయాలలో చేరే వాళ్లు మూడు రకాలుగా ఉంటారు. నిస్వార్థమైన సేవాతత్పరతే ప్రవృత్తిగా రాజకీయాలలో రాణించే వాళ్లు. శాంతం, సహనం, సంయమనం, సౌశీల్యం, సౌహార్దం అనే లక్షణాలు వీళ్లలో మెండు. ప్రశంసకు పొంగరు; అభిశంసకు కుంగరు. తమ ప్రత్యర్థుల ఉసురు పోసు కోవడం వీళ్లకు చేతగాదు; అవసరమైతే దేశం కోసం తమ అసువుల నైనా ధార పోసేందుకు సిద్ధం; అంటే వీళ్లు త్యాగధను లన్నమాట. ఇది మొదటి శ్రేణి; వీళ్లే రాజకీయ వేత్తలు.

అగ్నిమిత్ర

మహాకవి గురజాడ అన్నట్లు "సొంత లాభం కొంత మాను కొని" పరార్థ బుద్ధిని పెంచుకొని కొంచెం అటు – ఇటుగా ప్రజాసేవకు పాటు పడేవాళ్లు. వీళ్లలో స్వార్థం ఉంటుంది. కాని, గుడిని, గుడిలో లింగాన్ని మింగేటంతగా ఉండరు. లోకానికి జడుస్తారు. ధనార్జన కంటె మానాభిమానాలు ముఖ్యమని తలపోస్తారు; వీళ్లు రెండవ కోవకు చెందే రాజకీయ వాదులు.

ఇకపోతే – రాజకీయాలనే వృత్తిగా పెట్టుకొని, తీయని మాటలతో జనాన్ని కికురించి, దేశాన్ని దోచుకొని దొరలుగా చెలామణి అయ్యే వాళ్లున్నారు. అపార మస్తకం స్వార్థమే; వీళ్ల పలుకులు తేట పెలయేటి ఊటలా తియ్యగా ఉంటాయి; చేతలు గోతులు తవ్వు తుంటాయి; జేబులు నింపు కొంటుంటాయి; పసిగట్టి " అదే మని" అడిగితే బుస కొట్టడం వీళ్ల స్వభావం. ఇది మూడవ తెగ; వీళ్లు రాజకీయోప జీవులు. "నవ్వి పోదురు గాక నాకేటి సిగ్గు" అనే మాట వీళ్లకు అన్వర్థం.

దాదాపు 40 సంవత్సరాల క్రిందటి మాట. ఆంధ్ర రాష్ట్రానికై అమర జీవి పొట్టి శ్రీరాములు గారు ఆమరణ నిరాహార దీక్ష సాగిస్తున్నారు. భాషా ప్రాతిపదికపై రాష్ట్రాలను విడగొట్టడం నెహ్రూకు ఇష్టం లేదు; అందువల్ల కాంగ్రెసు వాళ్లు కూడా ఆంధ్ర రాష్ట్రానికి వ్యతిరేకత వ్యక్తం చేశారు. ఉద్యమాన్ని తీవ్రతరం చేసే సంకల్పంతో ఒకరోజు ప్రభుత్వ కార్యాలయాలు మూసి వెయ్యాలని జనం బయలు దేరారు.

అప్పుడు జిల్లా బోర్డు ప్రెసిడెంటు స్వర్గీయ నలమోతు చెంచు రామా నాయుడు గారు. ఆయన తన ఛేంబరులో కూర్చొని పని చేసుకొంటున్నారు. జనం దొమ్మీగా వెళ్లి, "అన్ని ఆఫీసులూ మూసేశారు; మీ ఆఫీసు కూడా మూసెయ్యండి" అన్నారు.

నాయుడు గారు తొణక లేదు – బెణక లేదు. "నేను క్రమశిక్షణ గల్గిన కాంగ్రెసు పార్టీ కార్యకర్తను. మా పార్టీ మీ ఉద్యమానికి వ్యతిరేకం. కాబట్టి నేను సీటులోంచి లెయ్యను – ఆఫీసు మూయను" అని ఖచ్చితంగా కుండ బద్దలు కొట్టినట్లు చెప్పేశారు. జనం రెచ్చి పోయ్యారు; కుర్చీని తోసేశారు; ముఖాన ఉమ్మేశారు. అయినా నాయుడు గారు ఉలక లేదు, బదులు పలక లేదు. ఏనుగులా గంభీరంగా ఉండి పొయ్యారు. ఆయన పైన ఉమ్మిన వాళ్లు ఊరూ పేరు లేకుండా పొయ్యారు; నాయుడు గారు మావంటి వాళ్ల హృదయాల్లో చెరగని ముద్ర వేసి నిల్చి వున్నారు. ఆయన లేరు; కాని ఆయన జ్ఞాపకాలు మాత్రం మిగిలి ఉన్నాయి; ఇక ముందు కూడా ఉంటాయి. అర్థదారులు తొక్కి ఎంతగా ఆర్జించినా, పొయ్యే నాటికి పూచిక పుల్ల కూడా మన వెంట రాదు. కడకు కట్టుకొన్న పెళ్లాం కూడా గడప దాటిరాదు. మనతో వచ్చేవి, ఈ లోకంలో ఉండి పొయ్యేవి మన మార్జించు కొన్న పేరు ప్రఖ్యాతులే.

60వ దశకంలో శైలాస వాసి శివలెంక శంభు ప్రసాద్ గారి సంపాదకత్వంలోని ఆంధ్ర పత్రికలో "తెలుగు వెలుగులు" అనే శీర్షికను గొల్లపూడి నిర్వహించారు. ఆసక్తికరంగా ఉండి పాఠకుల ఆలోచనకు పనిపెట్టిన శీర్షిక. రచయిత పేరు ఉండేది కాదు. ఎంతవరకు నిజమో కాని, శంభు ప్రసాదు గారు ముళ్లపూడి వెంకట రమణ చేత వ్రాయించే వారని చెప్పుకొనే వారు.

తెలుగు నేలపై వెలుగులు విరజిమ్మిన నేతల ఖ్యాతికి నిలువు టద్దంలా భాసించిందది.

అట్లాంటి వెలుగుల్లో స్వర్గీయ పుచ్చల పల్లి సుందరయ్య గారు కూడా ఉన్నారు. సుందరయ్య గారి నీతి నిజాయితీలు జగత్ప్రసిద్ధం. అంతటి సుందరయ్య గారి గురించి తెలుగు వెలుగు ముచ్చట సాగిన తీరు చూడండి–

అప్పుడు సుందరయ్య గారు పార్లమెంటు మెంబరు. పార్లమెంటు నిండోలగంలో ప్రసంగిస్తూ సుందరయ్య గారు నాటి ప్రధాని నెహ్రూను ఆవేశంలో దేశద్రోహి (Traitor) అన్నారు. ఢిల్లీ నగరంలో నెహ్రూ కున్న ప్రజాభిమానం అంతా ఇంతా కాదు. అటువంటి నెహ్రూను 'దేశద్రోహి' అని నిందించి, అర చొక్కా, నిక్కరు ధరించిన సుందరయ్య నింపాదిగా డొక్కు సైకిలు తొక్కు కుంటూ కన్నాట్ సర్కస్ మీదుగా – అసఫాలీ రోడ్డులో ఉన్న కమ్యూనిస్టు పార్టీ ఆఫీసుకు వెళ్ల గలగడం సుందరయ్య గారికే చెల్లింది – అని వ్రాస్తూ భారతంలో కర్ణుడికి సుందరయ్య గారికి పోలిక చూపింది. తనను కర్ణుడితో పోల్చి నందుకు సుందరయ్య గారు కినుక వహించ లేదు. సుందరయ్య ధర్మరాజు లాంటి వారైతే కర్ణుడంటా రేమిటి అంటూ శ్రీశ్రీ మాత్రం ఒక్క కంద పద్యంలో ఆంధ్ర పత్రికను మందలించడం జరిగింది. తనను 'దేశ ద్రోహి' అని నిందించి నందుకు నెహ్రూ ఆగ్రహోదగ్రుడు కాలేదు. సుందరయ్య గారి భరతం పట్టిస్తానని బెదిరించనూ లేదు.

నేషనల్ హెరాల్డు నెహ్రూ సొంత పత్రిక. ఎడిటర్ – మన తెలుగు వెలుగే – చలపతి రావు గారు. ఆయన నెహ్రూను కూడా విమర్శలో విడిచి పెట్టే వారు కాదు. నాటి ఉత్తర ప్రదేశ్ ముఖ్య మంత్రి గోవింద వల్లభ పంత్ ఒకసారి చలపతి రావు గారు తనపై చేసిన వ్యాఖ్యలను కోపగించుకొని, చలపతి రావును తొలగించ మని నెహ్రూను విన్నవించు కొన్నాడట. ఆయన విన్నపానికి నెహ్రూ చిరునవ్వే సమాధానం.

విమర్శలు వచ్చినప్పుడు ఆత్మ విమర్శ చేసుకొని తమను తాము చక్క దిద్దుకోవడానికి ప్రయత్నించడం గొప్ప సంస్కారం. అదినాటి నేతలకే చెల్లింది. అందుకనే వాళ్లు వామనుడు త్రివిక్రముడైనట్లుగా నేల నుండి ఒక్కొక్క మెట్టుగా నింగికి ఎదిగిన సమున్నతులు. నేటి నేతలు నేత అనే మాటకు తగరు; పీతలు. ఎండ్రకాయ లాగా ఎంతకాలమైనా నేలమీద బారుగా పాక వలసిందే; నిటారుగా ఎదగడం వీళ్ల చేతగాని పని.

## నెల్లూరు సబ్ కోర్టులో

వారంటు దరఖాస్తు నెం.54/1994 అసలు దావా నెం.62/1991 ఆంధ్రాబ్యాంకి - పిటీషనరు పోకూరి హైమావతమ్మ - రెస్పాండెంటు

రెస్పాండెంటు తాలూకు యీ దిగువ కనుపరచిన ఆస్తిని తే10-7-96దిన ఉదయము 10గంటలకు కోర్టువారి వలన కోర్టులో వేలము వేయబడును.

I. నెల్లూరు మున్సిపాల్టి, రామ్‌నగర్-డోర్ నెం.20రు పాత పంచాయతీ బ్లాకు నెం.24రు, తూర్పు రోడ్డు - దక్షిణము యిమ్మిడిశెట్టి రాధాకృష్ణయ్య యిల్లు యీయిల్లు మధ్య 2'3" వెడల్పుగల వుమ్మడి దారి పడమర మాచవోలు ఆదిశేషయ్య యిల్లు యీ యిల్లు ఉమ్మడి ప్రహారీ గోడ ఉత్తరము వాకా వెంకట సుబ్బయ్య యిల్లు. యీహద్దులలోని 7అంకణములు 42చ.అడుగులు = 50.30 చమీ స్థలము మమారు 6 అంకణముల 400.134 చమీ మిద్దెయిల్లు. డిక్రీదారు విలువ రు.80,000/- అమీనా విలువ రు.2,35,000/-

II నెల్లూరు తాలూకా గూడూరు సబ్ రిజీష్టీలో చేరిన అనపల్లిపాడు గ్రామములోని

(a) సర్వే నెం.76రు య 95-91ట్లలో య3-00 = 1.214 హెక్టార్లకు హద్దులు తూర్పు గ్రామసముదాయపు భూమి, దక్షిణము చెల్లపు సరస్వతమ్మ భూమి, పడమర వొంక, ఉత్తరము డిక్రీదారు విలువ రు.21000/- అమీనా విలువ రు.30000/-

(b) సర్వేనెం.1య 42.9( సర్వేనెం. 2రు య 21-92 యిల్ల య64-82ట్లలో య 4-00 = 1-61ϵ హెక్టార్లు భూమికి హద్దులు తూర్పు నాయుడుపేటవాము రైతుల భూమి దక్షిణము అమ్మలమడుగు శ్రీరామచంద్ర వగైరాల భూమి పడమర అనపల్లిపాడు గ్రామ సముదాయ భూమి, ఉత్తరము దాణాపారిజాతము భూమి. డిక్రీదార విలువ రు.28000/- అమీనా విలువ రు.40000/-

యం.ఏ. శేషారెడ్డి
పిటీషనర్‌గారి వకీలు

## జనవాణి

3 పేజీ తరువ

బిజెపి లాగా అధికార దాహపు ఆత్రుతతో ప్రభుత్వం ఏర్పాటు చేయబోయి అభాసుపాలు కాలేదు కాంగ్రెస్. దేశ ప్రయోజనాల దృష్ట్యా 13 పార్టీల కలయికైన యునైటెడ్ ఫ్రంటుకు బయట నుండి సహకారం అందించడం తప్పు కానేకాదు. 13 పార్టీల పాలన ఎన్నిరోజులైనా సాగ వచ్చు ;కాని బిజెపి అధికారంలో వుండిన 13 రోజుల్లో ఆ పార్టీ ప్రకటించిన విధానాలు ప్రజలకు ఏ మాత్రం ఉపయోగ పడేవి కావు. గోవధ నిషేధం. వుమ్మడి సివిల్‌కోడ్. రామమందిరం నిర్మాణం వంటి విధానాలు ఇప్పటి కిప్పుడు దేశానికి అవసరమా ? ఈ విషయాలను పి.యం.కె. గాంధీ గ్రహించక ఏక పక్ష విమర్శలు చేయడం సబబుగా లేదు.

నెల్లూరు షేక్.మన్సూర్

### అనియత విద్యా బోధకులను ఆదుకోవాలి

అనియత విద్యా విభాగంలో పలువురు నిరుద్యోగులు అతి తక్కువ భృతితో పదేళ్లుగా పని చేస్తూనే వున్నారు. వీరంతా పేరు కేమో అనియత విద్యాబోధకులు, సూపర్‌వైజర్లు. జీతం మాత్రం చాలా తక్కువ. వీళ్ల సేవలు వినియోగించుకొన్న ప్రభుత్వం వీరికిసహాయం చేయడం కనీస ధర్మం. వీరిని ఇన్‌సర్వీసు టీచర్లుగా గుర్తించి ప్రభుత్వ సెకండరీ గ్రేడ్ టీచర్ ట్రైనింగ్ ఇప్పించాలి. అటు పిమ్మట విరాసిగా వీరిని టీచర్ పోస్టుల్లో నియమించాలని మనవి.

రామన్నపాళెం ఎస్.వి.శర్మ

### సరిహద్దు చెరువుల విషయం పట్టదా?

తడ మండలంలోని కాదలూరు, మాంబట్టు, వెండ్లూరుపాడు చెర్వుల క్రింద షుమారుగా 3వేల ఎకరాల పైన మాగాణి భూమి ఉంది. ఆ చెర్వులను స్వరాజ్యం రాక ముందు విరాజాలో ఏర్పాటు చేశారు. కాని ఈ చెర్వుల తూములు, కలుజాలు ప్రస్తుతం శిథిలావస్థలో వున్నాయి. ఆ కాలువలకు కొద్దిపాటి రిపేర్లు చేసి, తూము చెక్కలు వేసి, కలుజాలు మరమ్మత్తులు చేయిస్తే ఈ చెర్వుల క్రింద రెండు పంటలు పండించ వచ్చు. ఈ ప్రాంత రైతుల గోడు ఆలకించే నాథుడే లేడు. జిల్లా కలెక్టర్ అయినా ఈ విషయమై శ్రద్ధవహించి సత్వరమే సర్వే చేయించమని మనవి.

వెండ్లూరుపాడు ఓ. చంద్రశేఖర్‌రెడ్డి

### నరసింహారావు గారూ నిష్క్రమించండి !

మాజీ ప్రధాని పి.వి.నరసింహా రావు గత ఐదేళ్లు చాక చక్యంగా ప్రభుత్వాన్ని నడుపుకొచ్చారు. మొన్నటి పార్లమెంటు ఎన్నికల్లో పార్టీ మరీ ఘోరంగా ఓడిపోవడానికి పి.వి గారి హయాంలో బయటపడ్డ 'స్కాం' లే కారణం. ప్రైవేటీకరణను పరిశీలించే విభాగం లేక పోయేసరికి అవినీతి అందలమెక్కింది. 'మౌనీ బాబాగా' పి.వి.నరసింహారావు వ్యవహరించిన శైలి వల్ల మహోన్నత చరిత్ర గల పార్టీ భ్రష్టు పట్టేలా ప్రజలు తీర్పు ఇచ్చారు. దాని తరువాత నైనా పార్టీలో ఓటమిపై కూలంకష చర్చ జరిగిందా అంటే అదీ లేదు. ప్రధాని దేవగౌడ విశ్వాస పరీక్ష పార్లమెంటులో జరిగిన ముందు రోజు పి.వి. కుటుంబం మరో 'స్కాం' లోచిక్కు కోవడం పార్టీ అభిమానులను మరింత కృంగ దీసింది. అధికారంలో వుండగా ఇన్ని ఆరోపణలు ఎదుర్కొన్న ప్రధాని దేశ చరిత్రలో మరొకరు లేరేమో.

నెల్లూరు టి.వి.నారాయణ

భారీ వర్షాలకు నిలిచిన నీళ్ళ మధ్య తేలుతున్న నెల్లూరు మూలపేట ధర్మరాజుల గుడి వెనుక ప్రాంతంలోని గుడిసెలు

## నెల్లూరు సంగతులు

4 పేజీ తరువాత

స్వీకారోత్సవం 16 తేది రాఘవ కళ్యాణ మండపంలో కన్నుల పండుగగా జరిగింది. లయన్స్ క్లబ్ కార్యదర్శి బి. ఉదయ భాస్కరరావు స్వాగతం చెప్పారు. బాలాజీ గ్రూప్ ఇండస్ట్రీస్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ శ్రీ పి.వి. ప్రసన్న రెడ్డి ముఖ్యఅతిథి; లయన్స్ క్లబ్ సేవలు ఇంకా అన్ని గ్రామాలకు విస్తృత పరచాలని కోరారు. శ్రీ లోకనాథన్ అధ్యక్షునిగా ఎన్.వి. రమణయ్య, కార్యదర్శిగా పి. ఆంజనేయులు, కోశాధికారిగా ఎన్. రామయ్యల చేత ప్రమాణాలు చేయించారు. లయన్స్ క్లబ్ సేవాప్రియ అధ్యక్షురాలిగా డి. రత్న, కార్యదర్శిగా వై. వినీత, కోశాధికారిగా పి. విమలా దేవి బాధ్యతలు స్వీకరించారు. లియో క్లబ్ అధ్యక్షునిగా సి. యుగంధర్, కార్యదర్శిగా పి. గోపాల కృష్ణ కోశాధికారిగా టి. సురేష్ నియుక్తులయ్యారు. పాత క్లబ్బుల కార్యదర్శులు బి. ఉదయ భాస్కరరావు, పి. అనూరాధ, పి. గోపాల కృష్ణ తమ హయాంలో చేసిన అభివృద్ధిని గూర్చి వివరించారు. లయన్ డిస్ట్రిక్ట్ గవర్నర్ వై. శ్రీనివాస రావు ముఖ్య అతిథులకు మెమెంటోలు బహూకరించారు. కార్యక్రమంలో రీజియన్ ఛైర్మన్ ఎస్.ఎస్.వి. రామ్మోహన రావు, జోన్ ఛైర్మన్ పి. సత్య నారాయణ, ఎ.వి. సుబ్బ రామయ్య, డాక్టర్ సాయినాథ్ తదితరులు పాల్గొన్నారు. సభకు లయన్స్ అధ్యక్షుడు బి.పాండురంగం అధ్యక్షత వహించగా, చివరన కొత్త కార్యదర్శి పి. ఆంజనేయులు వందన సమర్పణ చేశారు.

### ఉద్యమ రూపంగా అందరికీ విద్య కార్యక్రమం

ప్రాథమిక విద్యా కార్యక్రమం ద్వారా నెల్లూరు జిల్లాలోని గ్రామసీమల్లో 5 సంవత్సరాలు నిండిన పిల్లలందరినీ బడికి పంపి 2003 సంవత్సరానికి అందరికీ విద్య అందేలా ఒక కార్యక్రమాన్ని రూపొందించారు. ఈ విద్యా సంవత్సరం నుంచే ఈ పనిని మొదలెడతారు. గ్రామాల్లోని పిల్లలందరికీ విద్యను బోధించి వారిని విజ్ఞానవంతులు చేయడమే దీని ముఖ్యోద్దేశమన్నారు. కలెక్టరు గారు ఈ పథకం వల్ల నిరక్షరాస్యులు, అక్షరాస్యులవుతారని దీనివల్ల అనేక కుటుంబాలు ఆర్థికంగా బాగు పడటంతో పాటు, దేశం బాగుపడుతుందన్నా రాయన. జిల్లాలో ఈ కార్యక్రమానికి 2.56 కోట్ల రూపాయలు మొదటి విడతగా మంజూరు అయినట్లు వివరించారు. అల్లూరు, చేజర్ల, అనంత సాగరం, తోటపల్లి గూడూరు, దొరవారి సత్రం, చిట్టమూరు, దక్కిలి, సీతారామపురం మండలాల్లో ఈ పథకాన్ని అమలు చేస్తారు.

పాఠశాలలకు అత్యవసరమైన బోధనా పరికరాల కొనుగోలుకు 10 వేలు ముందుగా అందిస్తారు. జిల్లాలోని ప్రాథమిక పాఠశాలల్లోని 7700 మంది ఉపాధ్యాయులు, ఒక్కొక్కరు తమ పాఠశాల పరిధిలో 5 సంవత్సరాల వయస్సున్న 5 మంది పిల్లలను మొదట బడిలో చేర్పించాలి. పాఠశాలల నుంచి నిలిచిపోయిన మరో 5 మంది పిల్లలను వారి తల్లి దండ్రులకు నచ్చ చెప్పి తిరిగి పాఠశాలకు తీసుకురావాలి. ఈ కార్యక్రమాన్ని కూడా ఒక ఉద్యమ రూపంలో చేపట్టనున్నారు.

### ముంపు ప్రాంతాల్లో మంత్రి పర్యటన

టౌన్‌లో భారీ వర్షాలకు ముంపుకు గురైన ప్రాంతాలను రాష్ట్ర మార్కెటింగ్ మంత్రి టి.రమేష్‌రెడ్డి 15 తేది సందర్శించి వారి కష్టనష్టాలను అడిగి తెలుసుకొన్నారు. గాంధీనగర్ గిరిజన కాలనీలో నిల్చి పోయిన మురుగు నీటిని పంపింగ్ చేస్తున్న దృశ్యాన్ని పరిశీలించిన మంత్రి ఆ సమస్య శాశ్వత పరిష్కారానికి అక్కడి కక్కడే నిర్ణయం తీసుకొన్నారు. ఎమ్మెల్యే నిధుల నుంచి లక్షరూపాయలను పైప్‌లైన్ వేసేందుకు ఇస్తానని వాగ్దానం చేశారాయన. ముంపుకు గురైన 15 గిరిజన కుటుంబాల వారికి పక్కా ఇళ్ళు కూడా నిర్మించి ఇస్తానని హామీ ఇచ్చారు. ఈ సందర్భంగా మన్సూర్ నగర్‌ను కూడా మంత్రి సందర్శించారు. ఆర్డీఓ కుమారి టి.కె. శ్రీదేవి, మునిసిపల్ కమీషనర్ ఆంజనేయులు, ఎమ్మార్వో శేషయ్య మంత్రి వెంట పర్యటించారు.

### ఉన్నం బసవయ్య వార్డు ప్రగతి

సంవత్సర కాలంలో తాను తన వార్డులో చేసిన అభివృద్ధి పనుల విషయమై కౌన్సిలర్ ఉన్నం బసవయ్య ఒక పెద్ద కరపత్రం పంపారు. ఇప్పటి వరకు వార్డులో 23 పనులు చేసినట్లు చెప్పుకొన్నా రాయన. ఈ లిస్టులో పెద్ద పనులతో పాటు చెట్లు నాటించడం వంటి చిన్న పనులు కూడా వున్నాయి. శాంక్షన్ అయ్యి టెండర్ పిలిచిన పనులు 23, ప్రతిపాదించిన పనులు 19 వరకున్నాయి. వార్డులో సమస్యల విషయమై ప్రజల అభిప్రాయాలు తెలుసుకొనేందుకు ప్రతి ఇంటికి వెళ్లే కార్యక్రమం కూడా తాను రూపొందించు కొన్నానంటున్నారు బసవయ్య.

### యువజన కాంగ్రెస్ ప్రవీణ్ ఆవేదన

పోలీసులకు వాస్తవాలు తెలిసి కూడా కొం[illegible] రాజకీయ ప్రత్యర్థులకు తలవొగ్గి తనను వేధిస్తున్నారని జిల్లా యువజన కాంగ్రెస్ అధ్యక్షుడు సి. ప్రవీణ్ కుమార్ రెడ్డి వాపోయారు. 17 తేది ఇందిరా భవన్‌లో విలేకరులతో మాట్లాడుతూ ఉదయగిరి ఎమ్మెల్యే విజయ రామిరెడ్డి బావమరిది శ్రీనివాసులు రెడ్డిపై జరిగిన దాడితో తనకెంత మాత్రం సంబంధం లేదన్నారాయన. మాగుంట కుటుంబంలో తనకున్న ప్రాధాన్యతను తగ్గించేందుకు తమ పార్టీయులే కొందరు ఈ పనికి పాల్పడి వుంట వచ్చన్నా రాయన. తన అరెస్టుకు డిసిసి సరియైన రీతిలో స్పందించి వుంటే బాగుండే దన్నారు. దాడిలో పాల్గొన్నవా రెవరో ఎమ్మెల్యే విజయ రామిరెడ్డికి, పోలీసులకు స్పష్టంగా తెలుసునని ప్రవీణ్ వాదన. తన బెయిల్ రద్దు చేయమని పోలీసులు కోర్టులో మళ్లీ అభ్యర్థన పత్రం పెట్టడం అధికార పార్టీని సంతృప్తి పరిచే చర్యలో భాగమన్నా రాయన.

### డాక్టర్ రఘురామిరెడ్డి స్మారక కంటి వైద్యం

నేత్ర వైద్యుడు స్వర్గీయ డాక్టర్ పి. రఘురామి రెడ్డి స్మారకంగా ఆయన కుమారుడు డాక్టర్ పి. మహేశ్ ఇటీవల ఒక ఉచిత వైద్య శిబిరం నిర్వహించారు. 287 మందికి పరీక్షలు జరిపి, 36 మందికి ఉచితంగా ఆపరేషను చేశారు. 14 మందికి కంటిలో అద్దం (ఐఓఎల్) బిగించి, 184 మందికి కంటి అద్దాలు పంచి పెట్టారు.

## నగర సౌందర్యం

4 పేజీ తరువాత

శాఖ డైరక్టర్, జిల్లావాసి డాక్టర్ డి. సుబ్రహ్మణ్యం ముఖ్య అతిథిగా విచ్చేసి మాట్లాడారు. బడుగు వర్గాల సమస్యలపై నిర్దిష్టమైన ప్రణాళికలతో పోరాటం చేసిన వ్యక్తిగా వేమయ్య అని అభివర్ణించారు. జిల్లా ఎస్పీ బి. పూర్ణ చంద్ర రావు రాజకీయ పార్టీలకు ఒక చురక వేస్తూ మాట్లాడారు. పార్టీలకు సిద్ధాంతాలు, ఆశయాలు వుండగానే సరిపోవని వాటిని ఆచరణలో పెట్టె సామర్థ్యం ప్రతి కార్యకర్త అలవర్చుకొనేలా పార్టీలు ప్రయత్నించవలెయాలన్నారు. న్యాయవాది వి. అనంత రామయ్య మాట్లాడుతూ ప్రజా సమస్యలపై శాసన సభలో 19 వేల ప్రశ్నలు అడిగిన ఎమ్మెల్యే వేమయ్య తప్ప మరొకరు లేరన్నారు. సమావేశంలో దేవాదాయ శాఖ డిప్యూటీ డైరెక్టర్ కేశవులు, రైల్వే చీఫ్ పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ పనబాక కృష్ణయ్య, ఇన్‌కంటాక్స్ జాయింట్ కమీషనర్ ఎన్. మాల్యాద్రి కూడా పాల్గొన్నారు.

## చిత్రసమీక్ష

9 పేజీ తరువాత

శాంతి దీనావస్థను చూసిన స్త్రీ విముక్తి ఉద్యమ నాయకురాలు మల్లాది సుబ్బమ్మ, శాంతిని సహనం వీడి రావు మీద తిరగబడ మంటుంది. మహా శక్తిగా విజృంభించమని బోధిస్తుంది. శాంతి ఆదిశక్తిగా మారుతుంది. మహిళలు ఆమెకు అండగా నిలుస్తారు. మహిళా పోలీసు సహకారం అందిస్తారు. "రావు డౌన్ డౌన్" నినాదాలతో మేనేజర్ రావు ఇంటి మీదకి పోతారు. అతని ఇంటి కరెంట్ కట్ చేస్తారు. టెలిఫోన్, మంచి నీళ్ళు, పాలు ఆపుచేయిస్తారు. అసలు విషయం తెలుసుకున్న రావు భార్య కూడా రావు మీద తిరుగుబాటు చేస్తుంది. విధిలేక తప్పు అంగీకరించి మహిళ లందరికీ క్షమాపణ చెప్తాడు రావు.

స్త్రీ సమస్యతో కూడు కున్న కథను తుంగలో తొక్కి చిత్రం మొదటి భాగమంతా చిల్లర విషయాలకు స్థానమిచ్చి సమస్యను అభాసుపాలు చేశాడు దర్శకుడు. కథకు ముఖ్యమైన శాంతి పాత్రను లోప భూయిష్టంగా రూపొందించాడు. మొదటి సమస్య ఎదురైనప్పటి నుంచి, ఉద్యమ నాయకురాలు చైతన్యం నేర్పే వరకు శాంతి ఏడుస్తూనే వుంటుంది. చదువుకొని ఉద్యోగం చేస్తున్న స్త్రీ, ధైర్యంతో సమస్యలను ఎదుర్కొక ఒక అనామకురాలుగా ఎప్పుడూ ఏడుస్తూ కూర్చోవడ మేమిటి? ఈ తరం స్త్రీకి గుండె ధైర్యం అవసరం. శాంతిలాగా ఏ స్త్రీ కూడా అదేపనిగా ఏడవటం సమంజసం కాదు. దర్శకుడు శాంతి పాత్రకు పిరికితనం నూరిపోశాడు. సమస్యను నీరసింప చేశాడు.

మేనేజర్ రావు పాత్రలో ప్రకాష్‌రాజ్ చక్కగా నటించాడు. ఆనంద్‌కు ప్రాముఖ్యత లేక పోయినా వున్నంతలో తానున్నాననిపించాడు. మిగతా నటీ నటులూ ఫరవాలేదన్నట్లు నటించారు.

దివాకర్‌బాబు మాటలు దురుసుగా లేవు. "యమహా యమహా", "సహనం, సహనం జ్వలనం" - అనే పాటలు సాహిత్య పరంగాను, సంగీత పరంగాను, సందర్భాను సారంగాను సారవంతంగా వున్నాయి. మాధవ పెద్ది సంగీతం మెచ్చుకో తగింది. లక్ష్మణరావు కెమెరా ప్రకృతిని రమణీయంగా చూపింది. సమస్యల పరిష్కారం కోసం మహిళలను ప్రభావితం చెయ్యడంలో విఫలమైంది ఈ చిత్రం.

## సినిమా

9 పేజీ తరువాత

ఇప్పుడీ చిత్రంలో నేను లాయర్‌గా, ఆమె డాక్టర్‌గా నటిస్తున్నాం. ఇందులో కూడా ఆమె ఫైట్ సీన్‌లలో పాల్గొంటుంది. మా ఇద్దరికీ ఒక ఫైట్ ఉంటుంది కూడా." అన్నారు.

ఇంకా నామకరణం జరగని ఈ చిత్రంలో శివాజీ గణేశన్, టినూ ఆనంద్‌లు కూడా ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. మాటలు వీరేంద్ర సిన్హా, సంగీతం విజ్ఞాప, నిర్మాణం, దర్శకత్వం ఎస్. రామనాథన్.

### రెండు కుటుంబాల కథ

విజయనిర్మల దర్శకత్వంలో కృష్ణ, నరేష్, కస్తూరి, శ్రీశాంతి నటించే చిత్రానికి పై పేరు పెట్టారు. మాటలు పరుచూరి బ్రదర్స్.

### ఓసేయ్ .... రాములమ్మ

సామాజిక వ్యవస్థ నాశనమవుతోంది. రాజకీయం దౌర్భాగ్యమవుతోంది. బూజుపట్టిన బూర్జువాల పైన, పదవు లెక్కిన అసమర్థుల పైన ఒక స్త్రీ తెచ్చిన విప్లవమే ఈ చిత్ర కథ అన్నారు దాసరి నారాయణ రావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే "ఒసేయ్... రాములమ్మ" చిత్రంలో కృష్ణ సిన్సియర్ పోలీస్ ఆఫీసర్, విజయ శాంతి నాయిక. రాంకీ, అరుణ్ పాండ్యన్, చరణ్‌రాజ్, రామిరెడ్డి, కోట శంకర రావు, కోకా రాఘవ రావు, నర్రా, బి. కిషన్, శకుంతల, శైలజ, పావలా శ్యామల ఇతర పాత్రధారులు. సంభాషణలు సంజీవి సంగీతం వందేమాతరం శ్రీనివాస్.

కనిగిరిడిస్ట్రిక్ట్‌మున్సిఫ్‌కోర్టులో

SC.No:81/1994

సోమిశెట్టి మాల్యాద్రి...వాది Vs ఆకుల పోలిరెడ్డి...ప్రతివాది

To, ఆకుల పోలిరెడ్డి, S/o. మల్లారెడ్డి, పెదమునసూరు గ్రామం, మర్రిపాడు మండలం, నెల్లూరు జిల్లా.

ప్రాంసరి నోటు బాకీ వసూలుకోరి వాది పైకోర్టులో దావాదాఖలు చేసియున్నాడు. కాబట్టి మీకేమైనా ఆక్షేపణలున్నచో తే 8-7-1996 దీ పగలు 10.30ని లకు పై కోర్టు వారియెదుట హాజరై తెలుపుకోవలెను. లేనియెడల మీ పరోక్షమున తీర్మానించబడునని తెలుసుకోవలెను.

ఎస్.పోలిరెడ్డి
అడ్వకేటు, కనిగిరి

# Dr. C.V. RAMAN JUNIOR COLLEGE

The below average, the average and the above average students, improve their performance once they enter our Institution, Contrary to the popular belief that, we take in only the best and its natural for them to do well.
The SAMPLE statistical data provided below collected from a cross-section of our students of I.P.E.'96 proves the point beyond any doubt.

| Name of the Candidate | Percentage of Marks | | Difference in percentage |
|---|---|---|---|
| | in SSC | in Inter | |
| *V. Satyendranath Reddy* | 52% | 75% | 23% |
| *K. Koushik* | 60% | 83% | 23% |
| *B. Sai Sri Charan* | 46% | 68% | 22% |
| *I. Kalyana Chakravarthy* | 51% | 73% | 22% |
| *M. Chaithanya* | 59% | 81% | 22% |
| *P.G. Aparna* | 49% | 68% | 19% |
| *M. Arathi* | 51% | 70% | 19% |
| *M. Suman Preetham* | 58% | 77% | 19% |
| *J. Vikravardhan* | 60% | 78% | 18% |
| *K. Subba Rami Reddy* | 66% | 84% | 18% |
| *N. Sireesha* | 70% | 87% | 17% |
| *A. Suneel Kumar* | 61% | 78% | 17% |
| *K.V.N. Raghu Kumar* | 59% | 75% | 16% |
| *S. Madan* | 59% | 75% | 16% |
| *V. Radha Rama Lakshmi* | 75% | 91% | 16% |
| *Ch. Pranavendra Reddy* | 46% | 61% | 15% |
| *S. Bhavesh Kumar* | 60% | 75% | 15% |
| *D. Aishwarya* | 70% | 85% | 15% |
| *N. Shyam Vikas Rao* | 52% | 66% | 14% |
| *R. Anand* | 78% | 92% | 14% |
| *G. Bharathi* | 49% | 63% | 14% |
| *B.S.N. Kumar* | 51% | 64% | 13% |
| *V.V. Hazarath Sarath Kumar* | 53% | 66% | 13% |
| *R. Neelima* | 75% | 88% | 13% |
| *R. Bharath Kumar* | 74% | 87% | 13% |

| Name of the Candidate | Percentage of Marks | | Difference in percentage |
|---|---|---|---|
| | in SSC | in Inter | |
| *G. Syam Sundar Reddy* | 65% | 78% | 13% |
| *V. Malini* | 61% | 74% | 13% |
| *A. Rajesh* | 72% | 84% | 12% |
| *M. Madhu Sudhan* | 68% | 80% | 12% |
| *P.A. Krishna Kumar* | 70% | 82% | 12% |
| *D. Lavanya* | 54% | 65% | 11% |
| *M. Abdul Qadeer Ahmed* | 76% | 87% | 11% |
| *J. Suneel Kumar* | 58% | 69% | 11% |
| *Ch. Venkata Suresh* | 75% | 86% | 11% |
| *K.V. Soujanya* | 62% | 73% | 11% |
| *P. Mahendranath* | 51% | 62% | 11% |
| *J. Sravanthi* | 50% | 61% | 11% |
| *K. Vamseedhar Reddy* | 55% | 65% | 10% |
| *D. Kishore* | 73% | 83% | 10% |
| *L. Lavanya* | 56% | 66% | 10% |
| *M. Kalyani* | 65% | 75% | 10% |
| *C. Sushma* | 61% | 71% | 10% |
| *D. Phani Krishna* | 57% | 66% | 9% |
| *B. Sukumar Reddy* | 58% | 67% | 9% |
| *Sk. Musrath Afza* | 60% | 69% | 9% |
| *T.V. Jhansi Lakshmi* | 76% | 85% | 9% |
| *G. Mallikarjuna Rao* | 66% | 75% | 9% |
| *T. Rajeswari* | 59% | 67% | 8% |
| *P. Bhargavi* | 73% | 81% | 8% |
| *Meharunnesa Begum* | 82% | 90% | 8% |

The comparison holds good for almost all of our students who come from a genuine back-ground.
We are thankful to the sensible and pragmatic parents for the confidence they have in us.

## ADMISSION NOTIFICATION

FOR REGULAR INTERMEDIATE COURSE (Bi.P.C., M.P.C. & M.E.C. Only)

Admissions will be made on the basis of personal scrutiny.

**We.are proud to announce the introduction of a new combination M.E.C. (Maths, Economics& Commerce)**

Classes Commenced

Contact Straight away for Admission into Residential College

For more details
Saraswathi Nagar, Dargamitta. Nellore-524 003. Ph: 28977.

ROOPA ADS, Ph:23485.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (India) Limited, Nellore